ర చ యి త:

శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు.



# గల్లివర

రచయిత:

శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు.



రెండవకూర్పు 2000 ప్రతులు.

పబ్లిషర్సు:

వెంకటేశ్వరా పబ్లిషింగ్ వారి అనుమతిమీద.

నూలు సుబ్బారావు

శ్రీ పాండురంగాబుక్ డిపో, రాజమండ్రి

1940.

# సూచన.

నిరుపేదలయిన గృహస్థులు వరశుల్క పిశాచానికి జంకి, ఈడువచ్చిన తమపడుచులను కన్నెలగానే వుంచుకొంటే_ఆ దురాచారాన్ని మాపుచెయ్యలేని ఈసంఘం, అటువంటి ఆడపిల్లలగన్న తలిదండ్రులపై నిందారోపణచేసి, ఆడిపోసుకోవడ మెందుకూ?

ఒకరి కష్టసుఖాలతో నిమిత్తం లేకుండా నేటి సంఘం ప్రవర్తించే దారుణప్రవర్తనలు లక్షోపలక్షలున్నాయి. అందు కొన్నింటిని సూచించడానికే ఈప్రయత్నం.

ఇట్లు,
లేఖకుడు.

టెలిగ్రాం.

"ఉత్తరం అందింది. నీకు నా ఆశీర్వచనాలు—తాతయ్య." అని వ్రాసిన టెలిగ్రాముసు తిరిగి మరోమారు చదువుకొని, దానిని ఎవరిచేత పోస్టాఫీసుకు పంపుదామా అని నవీంద్రుడు ఆలోచిస్తూ కూర్చున్నాడు.

నవీ—(తనలో) నౌఖరుచేత పంపడంకంటే నేనే పోస్టాఫీసులో ఈ టెలిగ్రాముసు ఇచ్చేసివస్తాను. ఇప్పుడు పదిగంటలయి వుంటుంది. సీతాపురంనుంచి కలకత్తా మూడుగంటలలో టెలిగ్రాం వెళ్ళదూ? ఒంటిగంట కల్లా ఈటెలిగ్రాం మా రేణుకకుచేర్తాది. అప్పుడామెకు మనస్థిమితపడుతుంది.

నవీనచంద్రుడు టెలిగ్రాముసు చేతపట్టుకొని పయిమీద కండువా నువేసుకోబోతుండ, గుమ్మంలో ఒక ఒంటెద్దుబండి ఆగుతుంది. నవీనచంద్రుడు బండిదగ్గరకువెళ్ళి చూస్తాడు. బండిలోనుంచి ఒక ముప్పయి సంవత్సరాల వితంతువు దిగుతుంది.

నవీ—(సంతోషంతో) వచ్చావా చెల్లెమ్మా! రా లోపలకు, నీకు నాఉత్తరంచేరి మూడురోజులయింది. ఇంకారాలేదేమాఅనిఆలోచిస్తున్నా

చెల్లా—నీఉత్తరం చూడగానే నాకు గుండె బ్రద్దలైపోయేటంత దుఃఖం కలిగింది అన్నయ్యా! ఏపూట కాపూటే వద్దామని ప్రయాణమవుతుంటే తీసుకొచ్చేవాళ్ళెవరూ లేకపోతున్నారు.

నవీ—అల్లుడేమయినాడు?

చెల్లా—అతగాడికి శలవు దొరకందే.

నవీ—అందుకని నువ్వొక్కర్తెవ్వూ వచ్చేశావా?

చెల్లా—అతను నిడదవోలుదాకావచ్చి నన్ను రైలు ఎక్కించి వెళ్ళిపోయినాడు. ఎల్లాగో చేరాననుకో. రేణుక ఇలా నిర్వాకంచేసిం దేమిటిఅన్నయ్యా! దానికీ పాడుబుద్ధి ఎందుకుపుట్టిందీ? ఎవరికీ చెప్పకుండా కలకత్తా వెళ్ళిపోయిందా?

నవీ—మరే చెల్లెమ్మా! ప్రాణానికి ప్రాణంగా చూసుకుంటూ నాప్రాణాలన్నీ దానిమీదనే పెట్టుకొని బ్రతుకుతున్న నాకళ్ళల్లో దుమ్ము

ఇల్లా వుంటూండగా, ఒకనాడొక ఫిలింకంపెనీడైరక్టరు కారులో వెడుతూ, మిషనుగొల్లు దగ్గరనుంచి యింటికి వెళ్ళిపోతున్న అరవిందను చూసి ఆమె నెలాగునయినా వివాహం చేసుకోవాలని నిశ్చయం చేసుకొని రెండుమూడుసార్లు ఆమె యింటిముందునుంచీ—మిషనుగొల్లు దగ్గరనుంచీ కారులో వెడుతుండేవాడుట. దరిమిలాను అతను స్వయంగా అరవిందను కలుసుకొని తనఉద్దేశాన్ని ఆమెకు తెలియబరచి తనయొక్క హోదాను—స్థితిగతులను ఆమెతో చెప్పుకొన్నాడుట.

అరవింద, అతను అందమయినవాడు గాకపోయి నప్పటికీ—ధనికుడుగదా, అతన్ని చేపట్టుకుంటే సుఖపడవచ్చునుగదా అనేవుద్దేశంతో వివాహం చేసుకోవడానికి అంగీకరించింది! అంతా ఒకనెలరోజులకేందట, ఆయిద్దరూ వివాహం ఏర్పాటు చేసుకొన్నారు. స్నేహితురాలికి వివాహ మవుతుంటే రేణుకకు ఉత్సాహం కేంలోటు? ఆ పెళ్ళికి ఆధ్వర్యమంతా రేణుక స్నేహితుల సంకరిణీ ఆహ్వానించిందే అరవింద. రేణుకతో ఆవివాహం నాలుగురోజులూ నేనుకూడా అరవిందయింట్లోనేవుండక తప్పిందిగాదు. డబ్బుపెళ్ళిని మేమిటి అప్పుడంతా మనరేణుక చేతులమీదుగానే నడిచింది. ఒక గొప్పవన్నెన్ని లోటుకొద్దివాళ్ళకున్నా అరవిందకూ రేణుకకూ ఉన్నంతటిస్నేహం వుండదని నేను ఖచ్చితంగా చెప్పగలను. అరవిందయొక్క భాగ్యరేఖ బయటపడిందని ఆమెయొక్క స్నేహితులందరూ సంతోషించారు. నాకుమాత్రం ఆవివాహం ఇష్టంగా లేదు.

చెల్లా—ఏం?

సవీ—ఏమిటంటే అరవింద బంగారుబొమ్మ అపురూపమైనామె సౌందర్యం ముందు ఆమెభర్తయొక్క రూపం ఎంతమాత్రమూ చూడటానికి పనికిరాదు. అతను ప్రసన్నంగా చూస్తే నవ్వు, క్రీనుంతొండే గానచ్చు, అయినప్పటికే ఆయిద్దరకూ ఈడూజోడూ కుదరలేదు. ఆమెకూ అతనుపిలుచుంటే కాకిముక్కుకు దొండపండు తగిలించినట్లుగా వుంటుంది.

చెల్లా— ఏమయితేనేమి! భగవంతుడి నిర్ణయమలావుం... వా వి

...సింది. ఇంతకూ ఈపాడు చదువులు ఇల్లాంటిదుర్బుద్ధులన్నీ పుట్టిస్తున్నా యి. నాకూతురుపోయాక రేణుకనే నాబిడ్డగా పెంచుకొంటూ, ఈపద హారేళ్ళూ పెంచుకొన్నాను. ఈవృద్ధాప్యంలో దానిమూలంగా నాము ...గనుస్తుందేమోనని అనుకున్నాను.

చెల్లా—అదివెళ్ళిపోయేముందు దానికటువంటిబుద్ధి ఉందనినీకు తెలుసా?

సఖీ—తెలియదు. అదినాతో చెప్పిందా ఏమి నానా? నాలుగురోజుల ...కి జరుగుతుందనగా ఒకనాడు రేణు నాతో 'తాతయ్యా! నాస్నేహి తురాలయిన అనసూయభర్తకు ఈఊరునుంచి బదిలీ అయిందట. ఆమె నాతో నన్నుకూడా రమ్మంటూంది కొన్నాళ్ళపాటు వాళ్ళకి, అని చెప్పింది. ఇప్పుడు నన్ను విడిచిపెట్టి నువ్వు వెళ్ళిపోతే నేను బ్రతకగలనమ్మా! అవ్ రాకుండా, పదిహేనేళ్ళు నిండుతూన్నవయస్సులో వున్నపిల్లవు ఆడాకూ యీ ఊరు తిరుగుతే బాగుంటుందాఅని, నేనన్నాను. అప్పటికి ఊరుకొంది ఏమీ అనకుండా, మరినాలుగురోజులు పోయాక ఈపనిచేసింది.

చెల్లా-ఇప్పుడది ఎక్కడుందో-ఏమిటో ఏమైనా తెలుసా అన్నయ్యా!

సఖీ—అన్నీ మాట్లాడుకోవచ్చునులే చెల్లెమ్మా! లోపలకురా కూర్చుందాము. బండిలోంచి సామానులు లోపల చేరవేయించు.

చెల్లెమ్మ సఖీసచంద్రుడూ యింట్లోకివెళ్ళి కూర్చుంటారు. బండీ వాడు సామానునుతెచ్చి, యింట్లోచేరుస్తాడు. చెల్లెమ్మ అతనికీయవలసిన కిరాయినియిచ్చి పంపేస్తుంది,

సఖీ దాహంగాని-కాఫీగాని-ఏమైనా తెప్పించమన్నావా చెల్లెమ్మా

చెల్లా-ఏమీ అక్కరలేదురా అన్నయ్యా! అంతా ఓ గంటక్రితమే మార్గంలో పుచ్చుకొచ్చాను. ఏతే ఏమంటావు? క్షేమంగానేవుందా ...కి, ఇప్పుడెక్కడ ఉంటూవు? క్షేమంగానేవుందా? ఆసంగతి వినేవర కూ నాహృదయం ఉండబట్టడంలేదురా! ఎంత తెలివితక్కువపని చేసింది?

సఖీ—ఇదిగో ఈపూటనే దానిదగ్గరనుంచి ఉత్తరమొచ్చింది చె ల్లెమ్మా! ఈఉత్తరం వచ్చేవరకూ నాప్రాణాలు ప్రాణాలలో లేవు.

దరకూ వివాహం ఏర్పాటయిందనుకో తరువాత ఏంజరిగింది.

నవీ—ఆవివాహానికి నేనుకూడా వెళ్ళానని నీకు ముందుగానే చెప్పానుగదా! పెళ్ళిఅంతా నాగరికపద్ధతిలో జరిగింది. పెళ్ళికొడుకుపేరు బెనర్జీ. ఉంగరాలు మార్చుకోవడము—టీపార్టీ జరగడము—విందు. ఇంతేపెళ్ళి.

చెల్లా—బెనర్జీఅంటే అతడు బెంగాలీ యువకుడా ఏమిటన్నయ్యా

నవీ—అవును.

చెల్లా-ఐతే బ్రాహ్మణబాలిక బెంగాలీయువకుణ్ణి ఎలా చేసుకొన్నదీ?

నవీ—ఇప్పుడు విద్యావంతులయిన యువతులు అందరూ కులము ను పాటించకుండానే వివాహాలు చేసుకొంటున్నారులే. అందునుగురించి మనమంతగా ఆశ్చర్యపడవలసిన పనేమీలేదు.

చెల్లా—ఎవరో చేసుకొంటే చేసుకొందురుగాక. పెద్దవాడవు సనాతనధర్మాన్ని ఎరిగివున్నవాడవు నువ్వెందుకు వెళ్ళావన్నయ్యా! అదీ కుండా మన రేణుకకుమాత్రం అటువంటి వర్ణసంకరం వాళ్ళతో స్నేహమేమిటీ? ఈవ్యవహారంనాకేమీ బాగుండలేదు.

నవీ—నాకుమాత్రం బాగుంటాయేమిటి చెల్లెమ్మా! ఆపెళ్ళిళ్ళుడం నాకు సుతరామూ యిష్టమేలేదు? ఐనను ప.వ.నానికికూడా ? నిమాట కెదురుచెప్పలేకుండా వున్నాను చెల్లెమ్మా.

చెల్లె—అందుకనే యింతగా ముదిరిందికొంప. ఎప్పుడూకూడా ఆడదాన్ని తగినవిధంగా భయభక్తులలో వుంచకపోయినట్లయితే పరిస్థితు లిదేవిధంగా విషమిస్తూవుంటాయి.

నవీ—ఏంచెయ్యను చెప్పు చెల్లెమ్మా! పుట్టిన ఒకమాసంలో తల్లిపోయిన బిడ్డను కడుపులోపెట్టుకొని పెంచుకొన్నాము. నీకు తెలియనిదేముంది? ఆపిల్ల నింతవరకూ పెంచడానికి నువ్వు ఎంతగానో సాయపడ్డావు. నీ సాయం లేకపోతే మొగముండావాణ్ణయిన నేనేం చెయ్యగలను చెప్పు.

చెల్లె-అవునన్నయ్యా! నువ్వు చెప్పినది నేను కాదనడం లేదు. ఎంతో గారాబంగా పెంచినప్పటికీ ఆడపిల్లను తగినభయభక్తులలో వుంచకపోయి

నట్లాయితే మాటలు దక్కుతాయా? అని నేననేమాట! నరేచెప్పా గరు [illegible] యేంజరిగిందో.

నవీ — ఆవిధంగా రేణుక బలవంతం చెయ్యడంవల్ల నేనుకూడా అరవిందయొక్క వివాహానికి వెళ్ళకతప్పిందికాదు. రెండురోజులలో నేను కూడా అక్కడవాళ్ళతోనే వున్నాననుకో. తరువాత రేణుకతో నేను మనయింటికొచ్చేశాను. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే అరవిందయొక్క ఈవివాహం [illegible] రేణుకయొక్క బుద్ధిలో మార్పుగలిగినట్లుగా నేను గ్రహించుకొన్నాను.

చెల్లా — ఆవిషయం నువ్వేలా గ్రహించుకో గలిగావన్నయ్యా?

నవీ — అదే చెబుతున్నాను. రేణుకను కూడా సాధ్యమైనంత త్వరలోనే వివాహంచేసేసి ఒక అయ్యచేతుల్లోపెట్టి నావిధినినేను నెరవేర్చుకుందామని చూస్తున్నాను. అంతే కలసిన సంబంధం యేదీ కాలేదు. అన్నోదకాలకు కాస్త లోటు లేనటువంటివాణ్ణి మంచి సాంప్రదాయముకలవాణ్ణి తీసుకోవాలని నా వుద్దేశ్యం.

చెల్లా — అవును ఆవిషయం నాకూ తెలిసిందే. రేణుకకు వివాహంచెయ్యడానికి నువ్వెంతగా తాపత్రయపడుతున్నావో నేనూ చూస్తూనేవున్నాను

నవీ — అవునా? అన్నివిధాలా కాస్త బాగావున్న వరుడు వచ్చాడా అంటే అతను నాలుగువేలు—అయిదువేలు అడిగినా నేనెక్కడనుంచి తెచ్చియియ్యగలను. చెప్పు చెల్లమ్మా!

చెల్లా — అవునన్నయ్యా! మన సంసారాలేపాటి? మనం అంతలేసి కట్నాలీయగలమా?

నవీ — ఉంటే ఈయడానికి నాకేటువంటి అభ్యంతరమూ న్నూలేదు రేణుక ఆనందంకోసం నాప్రాణాన్ని సమర్పించడానికికూడా నేను జంకను, దానిసౌఖ్యంకోసం నాశక్తిని ధారపోసి ఈయడానికికూడా నేను వెనుదీయను రేణుక నా హృదయంలోని హృదయం—ప్రాణంలోని ప్రాణం.

చెల్లా — అవునన్నయ్యా! రేణుకయందు నీకు అధిక వాత్సల్యము

వుందని లోకమందరూ యెరుగుదురు.

నవీ—ఐతేమాత్రం ఏంలాభం చెల్లెమ్మా! ఐదువేలూ-నాలుగువేలు నాదగ్గర లేకపోవడంవల్ల రేణుకను ఇంతవరకూ వివాహం చెయ్యలేకపోయినాను. ఈఉన్న కాస్త కొంపనూ అమ్మేసినప్పటికీ ఎనిమిది వందలకంటె ఎక్కువరావు. మహావస్తే వెయ్యిరూపాయలు వస్తాయి. తరువాతనా బ్రతుకేమయిపోయినప్పటికీ, ఈయిల్లునుకూడా రేణుక పెళ్ళిగురించి అమ్మెయ్యడానికి సిద్ధంగానే వున్నాను. కాని ఈమాత్రంసొమ్ముతో నేనేం చెయ్యను. ఈకలికాలంలో కేవలమూ కట్నంకోసమే అయిదారువేలు కావలసివుంటే ఇంకేంచేసేదీ? అందువల్ల రేణుక పెళ్ళి'షయాన్ని గురించి నేను బెంగపెట్టుకొని—క్రమంగా క్షీణించిపోయాను.

చెల్లా——అయ్యో! దానివల్ల యేంలాభం అన్నయ్యా!

నవీ—లేదేఅనుకో నేనంతకంటే ఏమీ చేయలేక పోతున్నాను. నాయొక్క హృదయతాపాన్ని రేణుక గ్రహించింది. తనవల్లనుగదా నాకిటువంటి విచారం కలుగుతున్నదని తానుకూడా లోలోపలనే గ్రహించుకొంది. ధనికుడయిన భర్తనుపొందిన అరవింద అదృష్టవంతురాలనీ తనకుకూడా వివాహమైతే నాకింక ఏవిచార ముండదుగదాఅని అంటుండేది.

"తాతయ్యా! నాపెళ్ళినిగురించి నువ్వింతగా బెంగపెట్టుకోకు. రోజు వచ్చేటప్పటికి అదేఅవుతుందిలే. అరవిందకింత త్వరలో వివాహమవుతుందనీ-ధనికుడయిన భర్త లభిస్తాడనీ-ఎవరయినా అనుకొన్నారా? ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే-మనమెంత తాపత్రియపడినా రోజువచ్చేవరకూ, ఏపనీ గాదు-" అని ఒక్కొక్కప్పుడు రేణుక నాకు ధైర్యమును చెబుతుండేది. కాని నావల్లతనకు వివాహం జరగదనీ-నాకు ఓపట్టానికి వరుడు వచ్చెడన-వచ్చినప్పటికి అతనుకోరిన ధనము నీయడానికి నాదగ్గరరొక్కంలేదనీ-ఆమె తనలో అనుకొంటుండమే గాకుండా-ఆభావాన్ని నాయెదుటకూడా అప్పుడప్పుడు వెలిబుచ్చుతుండేది. ఏదోవిధంగా నాహృదయభారంతోపాటు తన కిస్యచెరనుకూడా స్వప్రయత్నంమీదనే తీర్చుకోవ

దానికామె చేసుకొంది. ఇలా ఒక నెలరోజులు గడచిపోగా, అరవింద భర్త అయిన బోసుతో కలకత్తా వెళ్ళిపోవడానికి నిశ్చయం చేసుకొంది. అరవింద, రేణుక ఏమి ఏర్పాటు చేసుకొన్నారో నాకు తెలియదు. కాని అరవింద తన్నుకూడా ఆమెతో కలకత్తా రావలసిందని-అక్కడ కొన్నాళ్ళు ఉండవలసిందనీ-కోరినట్లున్నా, తనకుకూడా ఆమెతో కలకత్తా వెళ్ళి కొంతకాలం సుఖంగా గడిపి రావాలని వుందనీ, ఒకనాడు రేణుకనాతో అంది

చెల్లా—అందుకు నువ్వేమన్నావు? ”

నవీ-ఏమంటానో నువ్వు గ్రహించుకోలేవు చెల్లాయమ్మా! వివాహానికెదిగిన పడుచుపిల్ల. అందులో అరవింద ఆమెకు చుట్టంగాదు. తోబుట్టువుగాదు. కేవలం స్నేహితురాలు. దానికితోడు ఆమె బెంగాలీ యువకుణ్ణి వర్ణాంతరవివాహం చేసుకొంటే, మన రేణుకను వాళ్ళతో పంపడానికి నేనెలా అంగీకరిస్తాను. వల్లగాదని రేణుకతో స్పష్టంగా చెప్పాను. నాకు నచ్చచెప్పాలని అది యెంతగానయినా ప్రయత్నం చేసింది. కాని నేనెప్పటికీ ఒప్పుకోలేదు.

చెల్లా—అందువల్ల నీతో చెప్పకుండానే అది స్నేహితురాలితో కలకత్తా వెళ్ళిపోయిందన్న మాట.

నవీ—అన్నమాట. చదువు-అది ఇంకా ఉత్తరంలో ఏమివ్రాసిందో చదువు. సంగతులన్నీ నీకే బోధపడతాయి. అని నవీనచంద్రుడు చెల్లాయమ్మతో అనగా, ఆమె అంతవరకూ మడచి చేతితో పట్టుకొనివున్న ఉత్తరాన్ని తిరిగి ఈవిధంగా చదవడం మొదలుపెట్టింది.

“ నేనిక్కడ ఏమయినా కష్టపడిపోతుంటానేమో ననీ-వేళకు అన్నము తింటున్నానో లేదో అనీ-సరిగా నిద్రపోతున్నానో లేదో అనీ మీ హృదయం ఎంతగానయినా బాధపడుతూనే వుంటుంది. కాని తాతయ్యా! అరవిందకూడా నాకేటువంటిలోటూ చేయడం లేదు. అవ్వ నన్ను చూసినంత వాత్సల్యంతోనే ఆమెకూడా నన్ను చూస్తూన్నది. నేను భోజనం చేస్తేనేగాని ఆమె చెయ్యదు. నాకు పక్క ఏర్పాటుచేసి నన్ను నిద్రపుచ్చిన తరువాత

పోతుంది. మనకింక రేణుక దక్కదు. అన్నయ్యా!

నవీ-పోనీ చెల్లాయమ్మా! అది ఎక్కడో ఒకచోట బ్రతికివుంటే, నాకదేపదివేలు. అది తానావిధంగా కలకత్తాలో అరవిందతో వెళ్ళిపోతున్నట్లుగా రాసిన చీటినిచూచినప్పుడు నాకు గుండెలు బ్రద్దలైపోయేటంతటి దుఃఖం కలిగింది చెల్లాయమ్మా! అది కానిదేశము-రేణుక ఏదుర్మార్గుడి మాయలలోపడి మోసపోతుందో-తిరిగి దానిక్షేమమయినా నేనువింటానో విననోఅని మహా కొట్టుకొనిపోయాను. అది ఎక్కడవున్నా-ఏఅన్యకులస్తుణ్ణి వివాహం చేసుకొన్నా పదికాలాలపాటు బ్రతికివుంటే నాకదేపదివేలు. దానిదగ్గరనుంచి ఈఉత్తర మొచ్చేవరకూ నాప్రాణాలుప్రాణాలలోలేవు చెల్లెమ్మా! ఇప్పుడు నాహృదయం రేణుకయొక్క క్షేమవార్తను తెలుసుకొని కాస్త కుదుటపడింది.

చెల్లా—అంతేలే. ఎక్కడికక్కడ అలాతృప్తి పడిపోతే వీల్లేదు. రేణుకమీద మనమింక యెటువంటిఆశా పెట్టుకోకూడదుగాని, అన్నువ్వు చెప్పినట్లుగా ఎక్కడనో ఒకచోట బ్రతికి బట్టకట్టుకొంటే చూసి సంతోషించాలి. వర్ణాంతర వివాహం చేసుకొన్న అంశంతో అదికూడా కలసివున్నందుకే యిప్పుడు మన మవమానమును పొందాలి దానికిశోదులేవు ఇదికూడా అరవిందంలాగునే మరోకులస్థుడి ఎవరినయినా వివాహం చేసుకొంటే, అప్పుడు మనమీ సంఘంవల్ల పొందే అవమానాన్ని భరించగలమా అన్నయ్యా! ఫలానా నవీనచంద్రంగారి మనమరాలు కలకత్తాపోయి ఏఅన్యకులస్తుణ్నో వివాహం చేసుకొంది? అని లోకమందరూ చెప్పుకొంటారు

నవీ—పోనీ చెప్పుకోనీయవే చెల్లెమ్మా! అందుకు మనం ఏమిచెయ్యగలము? బంగారంలాంటి పిల్లనిచ్చి పెళ్ళిచేస్తానంటే వేలకువేలు గుమ్మరించాలని పట్టుపట్టుకొని కూర్చుండే స్వార్థపరులయిన వరులను అరికట్టలేని ఈసంఘం నాకూతురు అన్యకులస్తుణ్ని వివాహం చేసుకొంటేమాత్రం ఎందుకు లెక్కచెయ్యాలి?

చెల్ల-అన్నయ్యా! నువ్వుకూడా ఇలాఅంటావని నేనెప్పుడూ అనుకోలేదు.

సవి—ఏంచెయ్యమంటావు చెల్లెమ్మా! ఈపిల్ల పెళ్ళినిగురించి నా మనసు ఎంతగా చిల్లులు గట్టుకొనిపోయి విసిగిపోయిందో నీకు తెలియదు. అడిగిన కట్నము సీయలేని, నాకు ఏఅల్లుడూ రాకపోయినప్పుడింక నేనేం చెయ్యగలను. రేణుక నాకష్టాన్ని సరిగా గుర్తించింది. అందుకనే తెగించి ఈసాహసం చేసింది. అది ఎంతకాలమని కన్యగా వుండిపోతుందీ?

చెల్లె—ఇప్పుడయినా ఈమాటలన్నీ మనమే అనుకుంటున్నాము గాని, రేణుక యింతవరకూ తన యిష్టమొచ్చినట్లుగా ఎవర్నో వివాహం చేసుకోబోతున్నట్లుగా ఈఉత్తరంలో ఏమీ వ్రాసినట్లుగా కనపడదే!

సవి—సరే ఈలేఖగాకపోతే—ఆపని రేపు జరుగుతుంది. రేణుక అసలు ఇల్లువిడిచి, అరవిందతో కలకత్తాపోయిన ఉద్దేశమే అదిగదూ!

చెల్లా—అవును నీ నువ్వు చెప్పినట్లుగా అది ఎక్కడో ఒకచోట, బ్రతికి సుఖంగావుంటే ఆదేవునకు పదివేలు.

సవి-ఆమాట నిజమేగాని-చిన్నతనంనుంచీ పెంచిన మమకారంవల్ల, అది దగ్గరలేకపోతే నాకు మతి చెడిపోతుందేమోనని భయంగావుంది చెల్లెమ్మా

చెల్లా—అలా అనుకొంటే ఎలాగు మరి? ఏదోవిధంగా, తృప్తిపడి సర్దుకోవాలి.

సవి—అప్పుడు జరిగినసంగతి నీతో సాంతంగా చెప్పలేదింకా. సరే అరవింద ఢిల్లీకివెళ్ళి మేముతిరిగి రావడము-రేణుక అరవిందతో కలిసి కలకత్తా వెడతానని నన్నడగడము-అందుకు నేనమ్మతించకపోవడము-జరిగిన ఒకనాలుగురోజులకు ఒకనాడు నేను మామూలుగా, వీధిసావారాలో పడుకున్నాను. రేణుక లోపలగదిలో పడుకొంది. అలాపడుకొన్నది ఎప్పుడు గు దాగుతూనూ సర్దుకొని, తలుపుతీసుకొని వెళ్ళిపోయిందో ఏమో నాకు తెలియదు. ఉదయం రోజూ నాకంటే రేణుకే ముందుగాలేచి, యింటిపనులన్నింటినీ పూర్తి చేసుకొని, వేడినీళ్ళుకాచి, నామంచందగ్గరికి వెళ్ళి, నన్ను ముఖం కడుక్కోవడానికి లేపేది. ఆనాడు ఆవేళన్నింతకూ లేపలేదు. చివర

కు తొమ్మిదిగంటలు ప్రొద్దుపోయాక నాఅంతటనేనే లేచాను. మంచందగ్గర వేడినీళ్ళ చెంబు లేకపోవడమునుజూచి తెల్లబోయాను. అపూట రేణుకయింకా నిద్రలేవలేదేమోనని అనుమాన పడ్డానుముందు. తీరా దాని మంచందగ్గరకు వెళ్ళి చూసేటప్పటికి, నాతల్లి కళ్ళపడలేదు. నాప్రాణాలు నిలువునా యెగిరిపోయినాయి. ఐదునిమిషాల్లో, యిల్లు-దొడ్డి-అంతా గాలించేను. రేణుకా! రేణుకా! అని నోరునొప్పిపెట్టేవరకూ పిలిచాను. ఉహుం! నాపిలుపుకెక్కడా సమాధానం లేదు. వెంటనేఅది అరవిందతో కలకత్తా వెడతా ననడము-నేను వద్దనడము-జ్ఞాపకమొచ్చి, ఇంకేముంది కొంపమునిగిపోయిందని గుండెలుబాదుకొని యేడ్చాను. తరువాత నాలు గుకలలో అరవింద యింటికి పరుగెత్తాను. గతరాత్రి ఆమె భర్తతో కలకత్తా వెళ్ళిపోయిందని చుట్టుపక్కలవాళ్ళు చెప్పారు. కన్యాత్వంలోవుండి ఈదరిద్రజీవితాన్ని భరించలేక,ఏఅఘాయిత్యపు పనినయినా చేసిందేమోనని చాలా భయపడ్డాను. తిరిగి యింటికొచ్చి, రేణుకవ్రాసిన ఉత్తరమును ఆమెమంచంమీద చూసేవరకూ నాకు నిజస్థితి బోధపడనేలేదు. ఆఉత్తరంలోనయినా అది ఈసంగతినంతనూ రాయలేదు. మూడేముక్కలు రాసి వూరుకుంది. కారణమేమిటి?

" తాతయ్యా! నాకోసం నువ్వేటువంటి బెంగా పెట్టుకోకు. నాకొచ్చిన భయమేమీలేదు. సాధ్యమయినంత త్వరలోనే నావివరాలన్నింటినీ నీకు తెలువుతాను.' అంతే అప్పుడది ఆచీటిలో ఈమాత్రమే రాసింది. అది ఏప్రాణత్యాగమోచేసిందని భయపడుతూన్న నా హృదయాని కాచీటి కొంతశాంతిని చేకూర్చ కలిగిందిగాని హృదయారాటం తీరలేదు. గుండెల్లోబరువు తగ్గలేదు. దాని చిన్నప్పటిసంగతులన్నీ నాకొక్కటొక్కటిగ జ్ఞాపకం రావడం మొదలుపెట్టాయి.

నాకూతురు సందుగర్భంలోవుండగా ఆమెయొక్కభర్త ఈలోకంలోనుంచి వెళ్ళిపోయాడు. తరువాత రేణుక ఇరవైరోజుల బిడ్డగావున్నప్పుడే ఆమెతల్లి గతించడము-అప్పనుంచీ ఆఇరవైదినాలగుడ్డునూ మీసా

యుంవల్ల, మీసాయంవల్లా, పెంచి పెద్దదాన్ని చెయ్యడము, మొన్న మొన్నటిదాకా, అవి నాగుండెలమీదనేతప్ప యింకెక్కడా పడుకోకుండా వుండడము-ఇవన్నీ తల్చుకొంటే నాగుండెలు బ్రద్దలై పోయేటంతటి దుఃఖం కలిగింది. రేణుక ఆడుకొన్న బొమ్మలను ఆమె చదువుకొన్న పుస్తకాలను చూసినపుడల్లా, నేనొకసారి ఆడదానిలాగున బేరుమని ఏడవడంకంటే ఇంకేమీ చెయ్యలేకపోయేవాణ్ని. రేణుకలేని ఈయింటిలో వుండడం నాకు చాలా అసహ్యమ పించేది.

అలమారుతీస్తే, దానిగాజుబొమ్మలు-చదువుకొనే పుస్తకాలు కనుపించి నాహృదయాన్ని కలచివేస్తాయి. గదిలోకితిరుగుతే-అదిపడుకొనే మంచము-కూర్చునేకుర్చీ-కనుపించి నాకెక్కడలేని మనస్తాపమును కలిగిస్తున్నాయి. దొడ్లోకి వెళ్ళానూఅంటే, రేణుకచే ప్రేమతో పెంచబడిన కనకాంబరము-మల్లి-చామంతి-మొదలయిన పూలమొక్కలన్నీ కనుపించి, మితిమీరిన దుఃఖాన్ని కలుగజేస్తూ వుంటాయి-

చెల్లా——అలాఅయితే ఎల్లాగు అన్నయ్యా! అది ఎక్కడో ఒకచోట క్షేమంగా వున్నవిషయం తెలిసినతరువాతయింకా కాస్త మనస్సును స్థిమిత పరుచుకోపోతే యెల్లాగూ?

సఖీ——ఈఉత్తరం వొచ్చినప్పటినుంచీ నాహృదయతాపం కొంత తగ్గిందిలేచెల్లమ్మా! కాని నాతల్లినాకు తిరిగి కనుపించేవరకూ, నాకడుపుమంట చల్లారదు. దానిముద్దుమాటలను వినేవరకూ నాహృదయతాపం తగ్గదు. నేనుదానికి తగిన వరుణ్ని తీసుకొచ్చి వారుకోరిన కట్నాలిచ్చి వివాహం చేయలేకపోయినానేగాని-నాచిట్టితల్లికెప్పుడూ తిండికీ-గుడ్డకూ లోటుచెయ్యలేదు.

చెల్లా-ఎంతమాట అన్నయ్యా! ఆవిషయం యెవరెరుగరన్నయ్యా!

సఖి——ఉండడానికి కొంప ఉండనేవుండిగదా! నెలనెలా నాకొచ్చే పాతికరూపాయల-పింఛనుడబ్బులూ, మాయిద్దరకీ ఎక్కతొక్కని.

చెల్లా——అయ్యో! ఎంతమాటన్నావన్నయ్యా! ఇప్పకాయలు

చెప్పకు బరువా? అదీగాకుండా చిన్నప్పటినుంచీ దాన్ని నువ్వు ప్రాణానికి ప్రాణంగా ఎంతో ముద్దుగా పెంచుకొన్నావు.

సవి.— ఏమయితేనేమి? దానికి తగిన సంబంధం తీసుకొచ్చి పెళ్ళి చెయ్యలేకపోయినాను. నా రేణుక యెప్పటికయినా తిరిగి నాకళ్ళ బడు తుందంటావా చెల్లెమ్మా?

చెల్లా.— ఫరవాలేదులే అన్నయ్యా! నువ్విప్పుడు దాన్ని గురించి అంతగా ఆదుర్దా పడవలసిన అవసరమేదీలేదు. అరవింద ఆమెను అధికవాత్సల్యంతో చూస్తుందన్న విషయం కూడా నువ్వు చెప్పిందేగదూ?

సవి.— ఆమాట నిజమే చెల్లెమ్మా! అరవింద రేణుకను నాకంటే యెక్కువగానే చూస్తుంది. ఆమె దాని కేటువంటిలోటూ చెయ్యదు.

చెల్లా.- రేణుక చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయింది అని నువ్వు ఉత్తరం రాయడంతోనే నాప్రాణాలు పైపైనే యెగిరిపోయినాయి అన్నయ్యా! నువ్వున్న పరిస్థితి నూహించగానే బయలుదేరి వచ్చేశాను. ఇక్కడకొచ్చి అదిరాసిన ఉత్తరం చూసేదాకా నామనసు కుదుట పడలేదు.

సవి.- చెల్లెమ్మా! రేణుక విషయమంతా ఇలాజరిగింది. కష్టమొచ్చినా సుఖమొచ్చినా నాకు రేణుకతరువాత నీకంటే ఇంకెవ్వరున్నారూ? నువ్వయినా మళ్ళీ వెంటనే నీకూతురుగారి దగ్గరకు వెళ్ళిపోకుండా నన్నుకనిపెట్టుకొని కొంతకాలముండకపోయినట్లయితే, నేనుండలేను చెల్లెమ్మా!

చెల్లె.- అలాగేలే అన్నయ్యా! వెళ్ళను నీదగ్గరనేవుంటాను. నాకుమాత్రం యెవరున్నారన్నయ్యా నువ్వుతప్ప? ఆతల్లికడుపున ఎనమండుగుర సంతానంలోనూ చచ్చినవాళ్ళు చావగా మనఈరెండుప్రాణాలూమిగిలాయి. నీకునేను-నాకునువ్వూ గాకపోతే యింకెవరవుంటారన్నయ్యా! నీకటువంటి అనుమానమింకేమీ అక్కరలేదు. నీకు హృదయం స్థిమితపడేవరకూ-రేణుకసమాచారం ఏమైనా తెలిసేవరకూ నేను నీదగ్గరనే వుంటాను.

సవి.— సరే చెల్లెమ్మా! రేణుక ఉత్తరంలో ఇంకా ఏమిరాసిందో సాంతంగా చదువు. నీకు మరికొన్ని విషయాలు తెలుస్తాయి.

అని అన్నగారు చెప్పగా చెల్లాయమ్మ అంతవరకూ చేత్తో మడిచి పట్టుకొన్న ఉత్తరాన్ని విప్పి తిరిగి ఈవిధంగా చదవడం మొదలుపెట్టింది.

---

౨

" తాతయ్యా! అరవిందతో ఖులాసాగానే గడుపుతున్నాను. మేమిద్దరమూ కలసి తరుచు సినిమాలకు వెళుతుంటాము. ఉద్యానవనాలకు షికారుగా, ఆమెకారుమీద వెళుతుంటాము. ఆమె భర్త అయిన బెనర్జీకి, ఇక్కడ ఒక పెద్దస్టూడియో ఉంది. ఆస్టూడియోలో మన ప్రాంతాల నుంచివచ్చినవారనేకమంది అద్దెకు ఫిలిములు తీయించుకొంటుంటారు. అప్పుడప్పుడు బెనర్జీ తనస్వంతఫిలిములనుకూడా తీయించుకొంటుంటాడు.

అరవింద-నేనూ రోజూ సాయంకాలమప్పుడు ఆ స్టుడియోకువెళ్ళి అక్కడ అప్పుడు షూటుకాబడె సీనులనుచూసి ఆనందిస్తూ వుంటాము. బెనర్జీకూడా నన్ను సోదరీవాత్సల్యంతో అతిగౌరవంగానే చూస్తున్నాడు అరవింద నాకు తగినవరు డెవరయినా దొరుకుతాడేమోనని ఇక్కడ ప్రయత్నంచేస్తూంది. ఏరోజు కేంజరుగుతుందో యెవరూ చెప్పలేరుగదా తాతయ్యా! నిన్ను విడిచిపెట్టి నేనిలావచ్చేస్తానని—ఈకలకత్తాలో అరవిందతో కలసి యింతకాల ముంటాననీ యెప్పుడయినా నేను మాత్రం అనుకున్నానా? తాతయ్యా! నేనిలా వచ్చేశానన్న విషయం చెల్లాయిదొడ్డమ్మకు వెంటనే రాసి, ఆమెను పిఠాపురం రప్పించుకోవలెను. చెల్లాయమ్మా నేనుచేసిన ఈపనికి చాలగా కోప్పడుతుంది. ఆమెకు మీరు సర్ది చెప్పి ఆమెకు నాపై కోపం రాకుండా చేయవలెను. కొద్దిరోజుల్లోనే అరవింద, మేమందరమూ కలసి, ఈచేరువలోనేవున్న అమరగిరి అనేగ్రామం వెళ్ళనైవున్నాము. ఎందువల్లనూఅంటే అక్కడ ఒక గొప్పయోగి వున్నాడుట. ఆయోగి జరిగిపోయినవీ జరుగవలసినవీ-ఉన్నవి ఉన్నట్లుగా చెబుతాడుట.

అందువల్ల ఆయోగిని ఒకసారి దర్శించివద్దామని అరవింద అంటూంది. నాక్కూడా ఆయోగిని చూడాలనేవుంది.

ఆయోగి ఉన్న విషయాలను ఉన్నట్లు చెప్పడమేగాకుండా, చాలా గొప్ప మహాత్మ్యంగలవాడుటగూడాను. అతడిచ్చిన మంత్రిజలమును సేవించినంతమాత్రాన ఎటువంటి ప్రబలరోగాలయినా పటాపంచలై పోతాయట. అరవిందకు అప్పుడప్పుడు డొక్కలో ఉపద్రవమైన నొప్పివస్తూవుంటుంది. ఆనొప్పి ఆమెకు చిరకాలంనుంచీవుంది, ఆనొప్పి వచ్చినప్పుడామె పొందేబాధను యెదటివాళ్లెవరూ చూసి భరించలేరు.

ఇప్పుడు ముఖ్యంగా ఆయనయొక్క దర్శనానికివెళ్ళడం అరవిందయొక్క ఈసూలవ్యాధినిగురించే. అరవింద ద్రవ్యవంతుడుగదా అని బెన్జిసి వివాహం చేసుకొంది. కాని ఆమె కాతనిపై ఎక్కువప్రేమ ఉన్నట్లుగానే ననుకోను. ఇది నేను వాళ్ళయిద్దర సంసారాన్ని చూసి తెలుసుకొన్న ఒక హాస్యవిషయం. నేను వారానికో ఉత్తరంచొప్పున మీకెప్పటి విషయాలనప్పుడు తెలియపరుస్తూ వుంటాను. నేనిలాగున అరవిందతో వచ్చేశానన్న క్రోధమును మనసులో వుంచుకోక ఈఉత్తరానికి మీరు సమాధానం వ్రాసేవరకూ నామనస్సుకు స్థిమితముండదు. కనుక నన్నెప్పటి వాత్సల్యంతోనే ప్రేమిస్తూ, ఈఉత్తరం అందినవెంటనే జవాబు వ్రాస్తారని నమ్ముతున్నాను.

చిత్తగించవలెను.

కలకత్తా 1–11–40 }

ఇట్లు,
శ్రీ ఋ క——"

చెల్లె-(ఉత్తరమును మడిచి, కవరులోపెట్టి) ఐతే ఈఉత్తరానికి వెంటనే సమాధానం రాయలేక పోయినావా అన్నయ్యా? నీదగ్గరనుంచి సమాధానం వెళ్ళేవరకూ మనసు స్థిమితంగా వుండదని రాసిందికూడాను

నవీ——ఇప్పుడేగదమ్మా ఈఉత్తరం వచ్చింది! ఉత్తరం చదువుతున్నాను. రేణుక నాదగ్గరనుంచి సమాధానాన్ని వెంటనే కోరిందిగాబట్టి ఇదిగో టెలిగ్రాంద్వారానే సమాధానంరాసి పోస్టాఫీసుకు వెళ్ళడానికి

తయారవుతున్నాను. ఇంతలో నువ్వూ బండిదిగి తయారయినావు.

(నవీనచంద్రుడు తాను రాసిన టెలిగ్రామును చెల్లెలకు చదివివినిపించాడు

చెల్లా—నువ్విలా టెలిగ్రామును రేణుకకు ఇవ్వబోతున్న విష యం నాకు తెలియనే తెలియదు. త్వరగా పోష్టాఫీసుకువెళ్ళి ముందుగా టెలిగ్రాము ఇచ్చేసిరా అన్నయ్యా! ఇప్పటివరకూ రేణుక క్షేమంగానే వుందిగదా! తరువాత అన్నింటికీ భగవంతుడే వున్నాడు.

నవీ—అయితే వెళ్ళివస్తాను చెల్లమ్మా! రేణుక వెళ్ళిపోయినప్ప టినుంచీ హోటలునుంచి భోజనం తెప్పించుకొని తింటూవున్నాను. అయి నప్పటికీ యింట్లో సమస్తమూ సిద్ధంగా వున్నాయి

చెల్లా—నేనొచ్చాకకూడా హోటలు మెతుకుల ఖర్మమేం అ న్నయ్యా! త్వరగా మడికట్టుకొని వంటచేస్తాను. నువ్వుకూడా పోష్టాఫీసు కువెళ్ళి ఆలస్యం చేయకుండా వచ్చెయ్యి అని చెల్లాయమ్మ చెప్పగా న వీనచంద్రుడు రేణుకకు ఈయడానికి రాసిన టెలిగ్రామును పట్టుకొని పో ష్టాఫీసుకు వెళ్ళిపోయినాడు.

(మార్గంలో నవీనచంద్రుడు తనలో)

అమ్మయ్యా! ఇప్పటికి నాహృదయభారం చాలావరకూ తీరిపో యింది. ఏవయసులో ఏజరగాలో అది జరగకపోతే పడుచుపిల్లలమన సులు ఇదేవిధంగా చలించిపోతూ వుంటాయిగాబోలు. పదహారేళ్ళుకూడా దాటాయినాతల్లికి పసిడిపసుపులు తేలే కొత్త అందంతోనూ-మిసమిసలాడే నూతన యావ్వనంతోనూ, నా తల్లి ఎంతకాలమని ఈకన్యాచెర ననుభ వించగలదూ? ఎలానయినా నాతల్లికి కన్యాచెర వొదిలిద్దామని నేనంతగా నయినా ప్రయత్నంచేశాను. కాని నాప్రియత్నమేమీ ఫలించకుండాపో యింది. అంతా డబ్బుతోపని. ఆడబ్బయినా పదులూ-పరకలూగాకుండా కొన్నివేలు ఎక్కడనుంచితీసుకురాగలనూ? అక్కడకూ ఉన్నకొంపనుకూ డా అమ్మినా పెళ్ళి నాతాహతకు మించిపోయింది.

ఈవిషయం రేణుక గ్రహించుకొని, ఇక ఎల్లకాలమూ నాదగ్గరనే

వుండిపోతే తనకు వివాహం కాదనుకొని, ఈప్రకారంగా చేసివుంటుంది. ఏది ఏమయినప్పటికీ నాతల్లి క్షేమవార్త నాచెవుల్లోపడింది. నాహృదయ తాపంతగ్గింది. ఈముసలికాలంలో హోటలు మెతుకులు తినక్కరలే కుండా పాపం చెల్లాయమ్మ ఉత్తరం రాయగానే కూతురింటి దగ్గరనుంచి చక్కావచ్చేసింది. తల్లితోడూ అంటా రిందుకేగదా! పోష్టాఫీసును త్వర గానే చేరుకున్నాను. ఉత్తరాముఁయచ్చేసి, వెంటనే ఇల్లు చేరుకొంటాను. చెల్లాయమ్మ నారాకకోసం ఎదురుచూస్తూ వుంటుంది.

———

3

కలకత్తాలో అరవింద-రేణుక, యిద్దరూ చెరో కుర్చీలోకూర్చుని టీ తాగుతూవుంటారు. ఆగదిలోని గోడలకు కొన్ని సినిమాదృశ్యాలు-సీనరీలు-కొందరు సినిమా నటుల చిత్రపటాలూ తగిలింపబడి వుంటాయి. టేబిలుఫాన్ గిర్రున తిరుగుతూ వుండడంవల్ల ఆగాలికి ఆయువతుల ముం గురులు చెదిరి కళ్ళల్లో పడుతూవుంటాయి. వాటిని వారుతిరిగి సర్దుకొం టూ. ఆఇద్దరుస్నేహితులూ ఇలామాట్లాడుకోవడం మొదలుపెట్టారు.

అర—టీలో పంచదార తక్కువయినట్లుగా వుందిగదూ రేణుకా

రేణు—అయిందిగాని, అదో తక్కువలోదిగాదు.

అర—వంటమనిషిని పిలవనా? కొంచం తీసుకొచ్చి వేస్తుంది.

రేణు—నా కక్కరలేదు. టీ మాత్రం స్ట్రాంగ్ గా వుండకపోతేబా గుండదు. నువ్వు కావలిస్తే తెప్పించి వేసుకో.

అర-నాకసలే ఎక్కువైంది పంచదార.నీకేకావాలేమోఅనిఅలా అడిగాను

రేణు—పోనీలే. (అని ఆమె టీ తాగుతుండగా పలమారుతుంది)

అర—నిమ్మళం-మీతాతయ్యగారు నిన్ను తల్చుకొంటున్నారల్లే [illegible] అందుకనే యిప్పుడిలా పలమారుతుంది.

రేణు-తాతయ్య నన్నుతల్చుకొని క్షణమంటూవుందని నాకునమ్మకం

నోచుకోనందుకు భగవంతుడు నిన్ను ప్రసాదించాడు.

రేణు—బావకూడా టీకి వస్తాడేమో ననుకొన్నాను.

అర—రాలేనందుకో. వేళతప్పిపోయింది. ఒకగంట పోయినాక, మనమే వెడదాము స్టుడియోకి.

రేణు—అరవిందా! నిన్ను చాలారోజుల నుంచి ఒకవిషయం అడుగుదా మనుకొంటున్నాను. మళ్ళీ నువ్వేమయినా అనుకుంటా వేమోనని అడగడం మానేస్తున్నాను.

అర—అదేమిటి రేణుకా! ఎప్పుడూ లేనిమాట అంటున్నా వేమిటి మన యిద్దరకూ అటువంటి భేద మెన్నడూ లేదే!

రేణు—అడగమన్నావా?

అర—తప్పకుండా అడుగు.

రేణు—బెనర్జీని నువ్వు మనస్ఫూర్తిగా ప్రేమించావో లేదోఅన్న సందేహం మీాయిద్దరకూ వివాహ మయినప్పటినుంచీ నాహృదయంలో బాధ పెడుతున్నది.

అర—(ఒక్క చిరునవ్వునునవ్వి) అసలు నీకటువంటి సందేహ మెందుకు కలిగింది?

రేణు—ఏమిా అంటే—బావ అందమయినవాడుకాడు. నల్లగా పొట్టిగా వుంటాడు. ముఖంనిండా మచ్చలుకూడా వుంటాయి. నువ్వు అవతరించిన సౌందర్యదేవతలాగునేవుండే నువ్వతన్ని ఎలాప్రేమించగలిగావు

అర—రేణుకా! మానవులను ప్రేమపాశంతో బంధించేది సౌందర్యమని నువ్వు అనుకుంటున్నావా?

రేణు-తప్పకుండా అదే-అందమైనవాళ్ళకు అందమైనభర్త లభించనప్పుడు ప్రేమ ఎలా కుదురుతుంది? బెనర్జీ అధిక ధనవంతుడే. అతనికి కలకత్తాలో రెండు పెద్ద భవనాలున్నాయి. ఒక స్టుడియోవుంది. నాలుగయిదు లక్షల ఖరీదుచేసే, వ్వంతఫిలిములున్నాయి. వాటివల్ల అతనికి ప్రతినెలా ఐదువేలరూపాయలొస్తాయి. ఈవిషయాలన్నీ నాకుతెలుసును. ఐనప్పటికీ

అతను కురూపి-నీఅందానికి తగనివాడు అని నేలభిప్రాయపడుతున్నాను.

అర-రేణుకా! నువ్వు తలంచినట్లుగా, ఒకవ్యక్తిని ప్రేమించడానికి-అతనిలోవుండే అందము-సిరసంపదలు కారణములుగావని నాఅనుభవం.

రేణు—వాటిని మించినదేముంది?

అర—గుణాలు.

రేణు—గుణాలా?

అర—అవును.

రేణు—నీఅభిప్రాయాన్ని నేను ఊహించుకోలేకుండా వున్నాను

అర—మావివాహానికి పూర్వం జరిగిన ఒకానొక విచిత్రసంఘటన నను చెబుతానువిను. అప్పుడయినా నాఅభిప్రాయం నీకు తెలుస్తుందేమో

అప్పటికి యిద్దరూ టీ తాగడమును పూర్తి చేశారు.

అర—మన మిద్దరమూ ఏడవతరగతివరకూ కలిసే చదువుకొన్నాము గదూ! మీతాతయ్య నిన్నువిడిచి, పొరుగూరిలో చదువుచెప్పించడానికి యిష్టపడలేదు. ఆపిఠాపురంలోనే పైతరగతులుంటే నిన్ను చదివించేవాడేమో! అని అరవింద అంది.

రేణు—తప్పకుండా చదివించేవాడు. మనవూళ్ళో ఏడవతరగతికంటే ఎక్కువ లేకపోవడంవల్ల-పెద్దచదువుకోసం పొరుగూరు వెళ్ళవలసి రావడంవల్ల-మాతాతయ్య నన్ను విడిచిపెట్టి వుండలేకపోవడంవల్ల నేనా ఏడవతరగతితోనే చాలించుకోవలసి వచ్చింది. ఈవిషయంలో నువ్వు ఊహించిన విషయం సరిగానేవుంది.

అర—అవునా? ఇకనాసంగతి ఆఏడవతరగతివరకూ చదువుకోడానికయినా నేనెంతగా కష్టపడ్డానో నీకు తెలియనివిషయంగాదు. స్కూలువారు నేను బీదరాలనని చెప్పి జీతంలేకుండా చదువంటే చెప్పేరుగాని, యింకా వాతిండికి-బట్టలకు-పుస్తకాలకూ నేనెంతగా యిబ్బందివడేదాన్ని. అప్పుడప్పుడు నీపుస్తకాలు-బట్టలు నాకిచ్చేదానవు జ్ఞాపకంలేదూ? వాళ్ళనూవీళ్ళనూ యాచనచేసుకొని చదువుకోవడంనాకు చాలా కష్టమనిపించ

ెందుకా అని నాలోనేను చాలాసార్లు తర్కించుకొన్నాను. కాని నాకె టువంటి ఆలోచనా తట్టలేదు. అత నెవరయితే మనకేం? అతని ఆలోచ న మనకెందుకు? అని నాలోఅనుకొని మామూలుగా పనిచేసుకొంటున్నా ను.ఇంతలో లోపలగుడ్డలుకత్తిరించుకొంటున్న పెద్దమేస్త్రీనాదగ్గరకువచ్చి

"అమ్మా! ఈవేళ జరుగురుగా అందీయవలసిన కొన్ని అర్జంటు పనులున్నాయి. హోటలునుంచి కేరేజి యిక్కడకే తెప్పిస్తే మీఇంటికి వెళ్ళకుండా పనిచేయడానికి వీలుగా వుంటుందా?" అని ప్రార్థేయపూర్వ కంగా అడుగుతే నేనతనిమాట కెదురుచెప్పలేక పోయినాను. అతని యే ర్పాటుప్రకారం చేయడానికి నేనంగీకరించడంవల్ల అతను సంతోషించి అ క్కడనుంచి వెళ్ళిపోయినాడు. నువ్వ నామిషనుకొట్టు దగ్గ కప్పుడప్పుడు వస్తుండేదానివి. మేస్త్రీని చూసేవుటావు. అతను పయికి చూశావా ఎంత దుర్మార్గుడిలా కనుపిస్తాడో?—

రేణు—అవును నేనతన్ని చాలాసార్లు చూశాను. కసాయివాడి లావుంటాడు ఎక్కడా దయా దాక్షిణ్యాలు లేనటువంటి కర్కోటకపు మనిషిలా కనుపిస్తాడు.

అర-అవునా? అతనివంటి యోగ్యుడూ-దయాగుణం గలవాడు-మ ర్యాదగలవాడు నేనింతకు ముందెక్కడా చూసివుండలేదు. నేను తనకింద పనిచేసే మనిషిని అనే అభిప్రాయంతో అతనెప్పుడూ మాట్లాడేవాడుకాదు. తన స్వంతకూతురుతో ఏవిధంగా మాట్లాడుతాడో, అతను నాతో కూడా ఎప్పుడూ అదే విధంగా ఎంతో మర్యాదగా మాట్లాడుతుండేవాడు.

రేణు—సరే ఆకారులో కూర్చున్న ఆ అగామీనిగురించి తర్వాత యేమిజరిగిందో చెప్పు.

అర—ఆ ఉదయం మొదలుకొని సాయంకాలంవరకూ ఆకారు అక్కడ నేనిలచివుంది. అందో మనిషికూడా అలాగేకూర్చొని వున్నాడు అతనిచేష్టలేమీ నాకర్థంకాలేదు భోజనానికి వెళ్ళలేదు సరిగదా కాఫీక యినా అతను కారుదిగి వెళ్ళలేదు. అతనెవరిరాకకోసమో అక్కడవేచి

వుండి వుంటాడని నాలో అనుకొని మధ్యాహ్నం పన్నెండు గంటలవరకూ కుట్టవలసిన బట్టలన్నింటినీ కుట్టేసి, అప్పుడు లోపలగదిలోకి వెళ్ళి-అంతకుముందే నాకోసం తేబడి, సిద్ధంగావుంచబడిన కేరేజీ విప్పుకొని, తిరిగి ఒక పావుగంటలో వచ్చి మిషనుదగ్గర కూర్చున్నాను. ఆ కారు-అందులోని వ్యక్తి-యథాప్రకారంగానే వున్నాడు. వాళ్ళవూసు నాకెందుకని సాయంకాల మూడుగంటలవరకూ కుట్టవలసిన బట్టలన్నిటినీ కుట్టడం పూర్తి చేసుకొని కాళ్ళచెప్పులు తొడుక్కొని గొడుగును చేతిలోపట్టుకొని కొట్టును విడిచిపెట్టి యింటిముఖంగా వెళ్ళిపోతున్నాను.

నేనో పదిగజాల దూరం నడచివెళ్ళిన అనంతరం కారుస్టార్టుచేయబడిన చప్పుడు నేను విని- వెనుదిరిగిచూశాను ఆ కారు నా వెనుకనుంచే వచ్చి నాతో మెల్లిగా నడవడం మొదలుపెట్టింది. అప్పుడా కారులో డ్రైవరు యింకెవ్వరూ లేరు అతనే కారును స్వంతగా డ్రైవు చేసుకుంటున్నాడు ఆ కారుకూడా నాతో మెల్లిగా పక్కనుంచి నడవడంలోగల విశేషమును నేను గుర్తించుకో లేకపోయినాను.

నేను మెల్లిగా నడుస్తే ఆ కారుకూడా మెల్లిగానడిచింది నేను వడిగా నడిస్తే అదికూడా వడిగా నడిచింది కొంతదూరం వెళ్ళేటప్పటికి నాకా కారు మీదా-అందులో కూర్చున్న వ్యక్తి మీదాకూడా చాలాకోపం వచ్చింది. ఇకనడవకుండా అక్కడే నిలిచిపోయాను. కారుకూడా నిలిచిపోయింది.

“ఇంత మర్యాదహీనంగా ప్రవర్తించడం చాలాతప్పు.” అని ఆ కారులోవున్న వ్యక్తివైపు చూసి తీక్షణంగా అన్నాను.

‘నాపరిస్థితి గమనించకపోవడంవల్ల అలాఅంటున్నావు.’ అని అతనన్నాడు.

‘మీపరిస్థితి జోలి ఎవరికిగావాలి?’ అనినేను మరింత తీక్షణంగాఅన్నాను.

“నీతో మాట్లాడదామని ఉదయంనుంచి ఇప్పటివరకూ భోజనమైనా చెయ్యకుండా—కాఫీఅయినా పుచ్చుకోకుండా—మీ మిషనుకొట్టుదగ్గర అల్లాగే వుండిపోయాను నువ్వు చూడలేదూ?” అని అతను తిరిగి నన్నడిగాడు.

"అలా వుండమన్నా దెవరు?" అని నేను తిరిగి ధైర్యంగా అడుగుతే-

"నీముఖంలో వున్న పరిబలకక్ష్య ఏదో నన్నాకర్షించుకొంది. నీలో వున్న అందానికి నేను దాసుణ్ణయిపోయినాను నీతో మాట్లాడి. నీఉద్దేశము తెలుసుకొనేవరకూ నేను గొంతుకలో మంచినీళ్ళయినా పోసుకో దల్చుకోలేను. అందువల్లనే కళ్ళెంతగా లోతుకు దించుకొనిపోయినాయో చూడు—మాట ఎలా తడబడుతూందో విను. ముఖమెలా వాడిపోయిందో తిలకించు- ఏం జాలి లేదూ?" అని అతను అంటూంటే నేను అతనికళ్ళ వయిపు చూశాను. అతను చెప్పినట్లు ఏమీ అబద్ధంలేదు అతనికళ్ళు లోతుకు దిగిపోవడమూ-ముఖం వాడిపోవడమూ- మాట తడబడుతూం డడమున్నూ నిజమే అప్పుడతనిమీద జాలి మనసు కరిగింది. జాలే సిది. అప్పుడే గానుగదా అతనుయిం చెప్పుతూ సూచా నామూలంగా ఒకప్రాణి హింసను పొందడం చూసి భరించలేని గుణానాది.

"నాతో మాట్లాడవలసిన అంతఅగత్యము పని మీకేముంది?" అని నేనడిగాను

"ఉంది-" అని అతను తిరిగి సమాధానం చెప్పాడు.

"ఏమిటో చెప్పండి-" అని నేను

"మీయిల్లెక్కడ?" అతను.

"ఒక మైలుదూరంలో వుంది" నేను

"ఇంటిదగ్గర స్థిమితంగా మాట్లాడాలని నావుద్దేశం-" అతను

"నేను ముందునడుస్తాను మీరు తరువాత వస్తారా?" నేను.

"అలా యెందుకూ? కారు వెనకసీటులో కూర్చుంటే ఐదునిమిషాల్లో మాయిల్లు చేరుకోవచ్చునుగా!" అతను.

నేనోసారి నాలుగువయిపులా చూశాను. ఎరిగివున్న వాళ్ళవరూ అప్పుడామార్గాన నడవకపోవడంవల్ల, నేను వెంటనే కారులో ఎక్కి కూర్చున్నాను. అతడు స్టార్టుచేసి కారును నడుపుతున్నాడు మార్గములో యిద్దరమూకూడా మాట్లాడలేదు. ఇతనెవరు? నాతో మాట్లాడడానికి

తవరకూ వేచివుండవలసిన అవసర మితని కేమివచ్చిందా అని నాలో నేను అనేకవిధాల ఆలోచించాను. కాని నాకేమీ తెలిసిందిగాదు. అతన్ని అంతకుముందెప్పుడూ చూసినట్లయినా గుర్తులేదు. ఏమయినా యింటికితీసుకువెళ్ళి ఈయనతో మాట్లాడినంతమాత్రాన ప్రమాదమేమీ లేదుగదా అని వూరుకున్నాను. మరికొంతసేపటికి ఆకారు నేనుండే బసదగ్గర ఆగింది.

——

౪

అర—నాలుగయినట్లుంది స్టుడియోకి వెళ్ళిపోదామా?

రేణు—అబ్బా! వెడదాములెద్దు! చెప్పేసంగతిని పూర్తిగా చెప్పు. ఆకొత్తమనిషిని ఇంటికి తీసుకెళ్ళి—అందులోనూ చీకటి-ఒంటిపాటు-నీకంతటి ధైర్య మెక్కడనుంచి వచ్చిందీ! భయమెయ్యలేదూ అరవిందా?

అర—నాకప్పుడు భయమెయ్యలేదు. తిండీ తిప్పలూ లేకుండా, ఉదయం మొదలుకొని సాయంకాలంవరకూ నాతో మాట్లాడాలని వేచివున్న అతన్నిచూస్తే నాకప్పుడు భయమేలేదు సరిగదా చాలా జాలికలిగింది ఆకొత్తమనిషి నాతో రహస్యంగా మాట్లాడదల్చుకొన్న విషయమేమిటో వినాలన్న కుతూహలం నాకూకలిగింది. అతని ముఖభావాలనుబట్టి-మాటలనుబట్టి వంచకుడిలాగున నాకు కనుపించలేదు. అలాకనిపిస్తే, ఆరోడ్డుమీదనే, నలుగురనూపిలచి తగినట్లుగా అతనికిబుద్ధిచెప్పి చేదాన్ని.

రేణు—ఊఁ! తరువాత ఏంజరిగిందో చెప్పు.

అర—తరువాత మేమిద్దరమూ కారుదిగాము. నేను గదితలుపు తాళంతీసి, అతన్ని లోపలకు తీసుకెళ్ళి ఒకకుర్చీలో కూర్చోనియమించాను. అతనికెదురుగా నేను మరియొక కుర్చీలో కూర్చున్నాను. అప్పుడు మాయిద్దరకూ ఈవిధంగా సంభాషణ జరిగింది.

“నీపేరు?” అతను.

" అరవింద " నేను.

" నీకు తలిదండ్రులు లేరా? " అతను.

" నేనొక అనాధబాలికను " నేను.

" ఆమిమనుకొట్టులో నీకు పనా? " అతను.

" అవును. " నేను.

" జీతమెంత? " అతను.

" పదిహేను " నేను

" నీకు వివాహమయిందా? " అతను

" లేదు " నేను

" కులమెవరు? " అతను

" బ్రాహ్మణులము "

నేనలా చెప్పినప్పుడు అతనొక వేడినిట్టూర్పును విడిచాడు.

" మీదేవూరు? "

" కలకత్తా. " అతను

" మీపేరు? " నేను

" బెన్జీ! " అతను

" కలకత్తాలో మీకే పని? "

" నాకు స్టుడియోవుంది " అతను

" ఈవూరు మీరెందుకొచ్చారు? " నేను

" రాజుగారితో పనివుండి వచ్చాను "

" మీరు నాతో మాట్లాడవలసిన విషయమేమిటీ? " నేను

" ఇంకెందుకూ? నాకోరిక అందని ద్రాక్షపండయింది. నాశ్రమ అంతా వృధాఅయింది. నే సత్యున్నత ఆనందసౌధం మీదనుంచి క్రిందికి త్రోయబడ్డాను. ఇంకెందుకు చెప్పడం? " అని అతను చిన్నబుచ్చుకొన్న ముఖంతో అంటుంటే నాకు మరింత జాలి కలగడం మొదలుపెట్టింది

" అంత నిరుత్సాహంగా యెందుకు మాట్లాడుతున్నారు? ' నేను

" చెప్పడానికి నోరురావడంలేదు " అతను,

" మిమ్మల్ని చూస్తే నాకు చాలా జాలికలుగుతుంది. " నేను

" నిజమేనా? " అతను.

" ముమ్మాటికీ నిజం " నేను.

" అయితే కొంతవరకూ నాజన్మ సార్థకమయింది. " అతను

" మీరు చెప్పదలచుకొన్న దేమిటో త్వర గా చెప్పండి. " నేను

" చెప్పమంటావా? " అతను.

" త్వరగా చెప్పండి. " నేను.

" నువ్వేమయినా అనుకొంటావేమో! "

" ఏమీ అనుకోను చెప్పండి. " నేను.

" నేనొక ఆశఘాతకుడనుగా భావిస్తావునువ్వు. " అతను.

" భావించను. చెప్పమన్నానుగా "

నే నలాగున అతన్ని పూరికే అడుగుతున్నానేగాని, అతని మనోభిప్రాయం నాకు తెలియకగాదు. అతను నన్ను ప్రేమించివుంటాడనీ—నేను బ్రాహ్మణకన్యను—అతను బెంగాలీయువకుడూ అవడంవల్ల, అతనికోరిక నెరవేర దేమో అన్న ఉద్దేశముతో అతడు మాట్లాడుతున్న విషయమును నేను గమనించకపోలేదు.

" చెప్పమన్నావా అరవిందా? "

" చెప్పండి సందేహమెందుకు? "

" నీ అపురూపసౌందర్యాన్ని చూసి, నేను ముగ్ధుడయినాను. అరవిందా! నువ్వు మిషనుకోటుదగ్గరనుంచి యింటికి వెళుతున్నావు-నేను రాజాగారినిచూసి తిరిగి బసలోకి వెళుతున్నాను. అప్పుడు నీరేఖలు నాహృదయం శాస్వితంగా హత్తుకొనిపోయినాయి. నాసిందుహృదయాన్ని ఇవ్వుడు నీపాదార్పణ చేస్తున్నాను. నువ్వుదానికి స్వీకరించినాచెల్లుతుంది. ' అని అతను ఉద్రేకంగా చెబుతుంటే—

" మీకింతవరకూ వివాహం కాలేదా? " అని అడిగాను.

"నామనసు నాకర్షించుకోగల కన్యలింతవరకూ నువ్వుతప్ప ఇంకెవ్వరూ కనుపించలేదు." అని అతడన్నాడు.

"అంతగా మెన్నదగినది నాలోమాత్రమేముందీ?" అనిఅడుగుతే

"ఆవిషయం నిన్ను సృష్టించిన భగవంతునికి మాత్రమే తెలియాలి." అని అతనన్నాడు.

నాకు నవ్వొచ్చింది.

"మీకేమీ తెలియదూ?" అని నేనడిగాను.

"ఏమీ తెలియదు. నిన్నూ, నిన్ను సృష్టించిన భగవంతుణ్ణీ ఆరధించుకోవడంతప్ప నాకింకేమీలేదు." అని అతను ఒప్పుకొన్నాడు.

"అయితే మీరిప్పుడు నన్నేమి చెయ్యమంటారూ!" అనినేనడిగాను

"ఏమిచేయడానికీ నీమీద నాకధికారంలేదు. నానిందుహృదయాన్ని నీకు సమర్పించుకొన్నాను, దానినినువ్వు స్వీకరించినా తృణీకరించినా చెల్లుతుందని నీతో యింతకుముందే చెప్పానుగదా!" అని అతనన్నాడు.

"అన్యకులస్థులమయిన మనమిద్దరకూ ప్రేమఎలాకుదురుతుందీ?" అని నేనన్నాను.

"అయ్యో! పవిత్రప్రేమకు కులభేదము లెక్కడివి అరవిందా? నీఅంతరాత్మకు నమ్మకమయితే—ఏసాంఘిక సూత్రమూ—ఏకులకట్టుబాటు కూడా మనలను వేరుచెయ్యలేదు." అని అతనంటే—

'మీప్రేమను తృణీకరించడానికి నాకు నోరురావడంలేదు' అనినేనన్నాను

'అరవిందా! నీమాటలు నాచెవుల్లో అమృతమును గురిపిస్తున్నాయి. నాశ్రమఫలించింది. నాకోరికనెరవేరింది' అని తనఆనందాన్ని వెలిబుచ్చాడు

"నేను పెద్దలులేని స్వతంత్రురాలనుగాబట్టి ఇలాధైర్యంగాచెప్పగలుగుతున్నాను." అని నేనంటే—

'అరవిందా! సౌందర్యమయిన నీముఖచంద్రుడిలాగునే—నీహృదయంకూడా అతివిశాలమయినదని నేను గ్రహించుకో గలుగుతున్నాను.' అని అతనన్నాడు.

"మనమిద్దరమూ కలుసుకొన్న వేళావిశేషమే నాచేత ఆమాట
గి రి. అని నేనన్నాను.

మొదటిసారి కలుసుకొన్నప్పుడు జరిగిన విష
యం. ఇది జరిగిన అనంతరం, బెనర్జి తనపని అయిపోయినప్పటికీకూడా న
న్నుగురించి, మరో వారంరోజుల్లవరకూ పిఠాపురంలోనేవుండి పోయినా
డు. అనుదినమూ సాయంకాలం మప్పుడు నాగదికి వస్తూవుండేవాడు నేను
కిస్తుండేవాన్ని. అతన్ని నేనెందుకు ప్రేమించానో ఇప్పటికీ చె
అందంచూడలేదు. సిరిచూడలేదు. అతనిఆస్తిపాస్తులను
గురించి, మీరు చెప్పేకొవడమేతప్ప మాకెంతడబ్బుందో ఎన్ని భూములు
న్నాయో నాకీనాటివరకూ తెలియదు. ఆయనప్పుడు చెప్పనూలేదు. నేను
అడగనూలేదు. ఆవారంరోజులలోనే మాయిద్దరకూ ఎన్నోసంవత్సరాలు
పాతస్నేహంలాగున ప్రేమదృఢపడిపోయింది. ఒక్కరోజు అతన్ని చూడ
కుండా నేను నన్ను చూడకుండా అతనూ వుండలేకపోయేవాళ్ళము. ఇద్దర
మూకలసి అతనికారులో షికార్లకూ—సినీమాలకూ వెడుతూండేవాళ్ళం
మా వెనుక సంఘమూ ప్రజలూ ఏమిఅనుకొంటున్నారో వినడానికయినా
నేను లెక్కచెయ్యలేదు. ఈవిధంగా వారంరోజులు గడచిన అనంతరం తి
రిగివస్తానని చెప్పి బెనర్జి ఎక్కడికో వెళ్ళిపోయినాడు నెలరోజులవరకూ నా
కంటికి కనుపించలేదు. అందువల్ల అతను చెప్పినమాటలన్నీ బూటకములు
అతను నన్ను వంచనచేశాడనీ-అభిప్రాయపడ్డాను. అనవసరంగా హృద
యాన్నివిప్పి అతనిదగ్గర నిష్కల్మషంగా ప్రవర్తించానేఅని విచారించాను
అప్పు డంతచనువుగా మసలుతూ—నాదగ్గరకు వస్తూ పోతూవున్న
నీతోనయినా ఈవిషయం చెప్పలేదు. చెబుతే నా తెలివితక్కువను విని
నవ్వుతావేమోనని భయపడ్డాడు. జరిగిపోయిన ఈపనికి నాలోనేనే కుమి
లి కుళ్ళి ఏడ్చానుగాని ఎవరికీ చెప్పలేదు. ఒక నెలగడచిన అనంతరం బెన
ర్జి తిరిగివచ్చాడు. అప్పుడు పోయినప్రాణాలు తిరిగి వచ్చినట్లయింది. ఏ
వో తొందరపనులు వుండడంవల్ల అంతకాలంవరకూ రాలేకపోయినానని

చెప్పి అతనునన్ను క్షమార్పణ వేడుకొన్నాడు- దరిమిలాను నావివాహ విషయమునుకూడా అతనేతలపెట్టి మరిరెండు మాసాలవరకూ నాతో పిఠాపురంలోనే వుండిపోయినాడు. అప్పటినుంచీకూడా నేను బెనర్జిని ప్రేమించినట్లు మేమిద్దరము వివాహమాడబోతూవున్నట్లు మీాఅందరకూ తెలిసింది. తరువాత వివాహం జరగడం మొదలుగాగల విషయాలన్నింటినీ నువ్వేస్వయంగా యెరుగుదువుగాబట్టి వేరే చెప్పనక్కరలేదు.

అని అరవింద తన ప్రేమగాథనంతనూ రేణుకతో చెప్పింది.

రేణు—అయితే నువ్వు బెనర్జీని అందుకోసం ప్రేమించలేదన్న విషయం నాకుతెలుసు కాని ద్రవ్యవంతుడుగదా అని ఆలోచించి వివాహం చేసుకొన్నావేమోఅని నీవివాహ సమయంలో నేనూ మా తాతయ్యా కూడా అనుకున్నాము.

అర—భగవంతుడితోడు రేణుకా! డబ్బుకోసమూసించి నేను అతన్ని ప్రేమించలేదు. అతని స్థితిగతులు తెలుసుకొనే నేనాతన్ని ప్రేమించానా? ఈవరకూ అతని స్థితిగతులు నాకు తెలియవని చెబుతేనమ్మవూ! బెనర్జీ యిప్పుడున్నటువంటి శ్రీమంతులుగాక ఒక బికారిఅయినప్పటికీ నేనతన్ని ప్రేమించి వివాహం చేసుకొనేదాన్నే. అందుకు కారణమేమిటో నాకు తెలియదు. అతని మంచిగుణాలే, నన్నాతనికి దాసురాలిని చేశాయేమోనని నేనొక్కొక్కప్పుడనుకొంటూ వుంటాను.

రేణు—కావచ్చును. ఇంక స్టుడియోకు పోదామా?

అర—చెప్పినదంతావిని ఇప్పుడిలా అంటున్నావా?

రేణు—అయ్యో! ఇప్పుడు నేనేమన్నాను అరవిందా! స్టుడియోకు వెళదామని యింతకుముందే అనుకున్నాము గాబట్టి తిరిగి జ్ఞాపకంచేశాను. పోనీ మానేదామా?

అర—వెళితే వెళదాములెద్దు! ఇంకా కాస్సేపుండి జరిగిపోయిన ఈసంగతులన్నీ తల్చుకొంటే నాకదేదో కలలా కనిపిస్తుంటాయొక్కొక్కప్పుడు. నేనొక దిక్కులేని అనాథ నవడమేమిటి? మిమహు

కట్టుకొని పొట్టపోషించుకోవడ మేమిటి? నాతాహతకు మించిన లక్షాధి కారిఅయిన ఈబెనర్జిని వివాహంచేసుకొని, కాపురం చేయడమేమిటి.

రేణు—అంతా దైవికం. మనలో యేముంది అరవిందా?

అర—నీకు అవసరమయినంత కట్నమునుయిచ్చి తగినవరుణ్ని తీసుకురావాలని నాభర్త ఉత్సాహపడుతున్నాడు. నీవివాహం నిమిత్తం మయిదారు వేలవరకూ ఖర్చుపెట్టడానికి వారు నిశ్చయం చేసుకొన్నారు

రేణు—ఆఁ! మరేయిప్పుడు నాపెళ్ళికేం తొందరొచ్చింది మధ్య మధ్య నువ్విటువ్వంటి కొంటిమాటలే ఆడుతుంటావు.

అర—తొందరగాదూ?వివాహం చేసుకోకుండా ఇలా యెంతకా లముంటావు రేణుకా! మీతాతయ్య నీపెళ్ళినిగురించేకదా బెంగపెట్టుకొ నివున్నాడు ఆవృద్ధుడితో చెప్పకుండా నిన్నాతనినుంచి వేరుపరచి తీసుకొ చ్చినందు కేమాత్రమయినా నిరవాకం చేయకపోతే యెలాగు? తెరచాటు నున్నాడా పెళ్ళికొడుకెవరో త్వరగా బ యటపడితే బాగుండును. నీకెటు వంటిభర్త కావాలి రేణుకా? అందమయినవాడు కావాలిగదూ?

రేణు—అబ్బాపోనిద్దు! ఆకబురుచెప్పి—ఈకబురుచెప్పి చివరకునా పెళ్ళి సంభాషణలోకి దింపావేమిటి?

అర—అవును చివరకదే కావలసిందిమరి నాకు జరుగవలసిన ము ద్దుముచ్చటలన్నీ జరిగిపోయినాయి. ఇక నీముద్దు ముచ్చటలనే మేమూ మీతాతగారూ కూడా చూడాలనుకుంది.

రేణు—పోనిద్దమ్మా యింకవ్వూరుకో.

అర—ఎంత అందమయిన వాడొస్తాడోయేమో నీకుగాని. బెనర్జీ నంటి భర్త వస్తే పెళ్ళిచేసుకుంటావా రేణుకా?

రేణు—నేను మాట్లాడను.

అర—అవును ఎందుకు మాట్లాడతావ్వూ? ఆటువంటి అనాకారి భర్త దొరుకుతే ముఖంమీద ఉమ్మేస్తావు. ఆవిషయం నాకుతెలుసు. అం దుకనే అందమయిన భర్తను చూడమని మీబావతో చెబుతున్నాను

రేణు—అవ్రూసుకుంక ఒదిలెయ్యి అరవిందా! నుదుటరాత ఎలా వుంటే అలాజరుగుతుంది. దానికి మనం కర్తలమా యేమిటి?

అర.—ఓయబ్బో! ఈ వేదాంత మెంతకాలంనుంచీ?

రేణు—ఇంక స్టుడియోకి వెడదాం నడవో! జడలు వేసుకోవడము ముస్తాబుకావడము—ఇంకా బోలెడంత ఆలస్యముంది. బొత్తుగా చీకటి పడి పోయిన తరువాతనా యేమిటి వెళ్ళడం? ఇప్పుడు వెడితే, తిరిగి బావతో కలసి కారుమీద యింటి కొచ్చెయ్యవచ్చు.

అర—అయితే త్వరగా త్వరగా తలదువ్వి జడఅల్లుకో ఈ లోవు గా నేనూ తయారవుతాను. కుర్రాడింతకుముందే మల్లిపూలు జాజిపూలూకోసి డ్రాయరుమీద పోశాడు. అని అంటూ అరవింద ఒకగదిలోకి వెళ్ళబోతుంది. రేణుక జడనువిప్పి దువ్వెన్నకోసం మరోగదిలో కెళ్ళింది. ఇంతలో ఎర్రబైసికిలుమీదవచ్చిన ఒక పోష్టుజవాను వీధిలో కేక వెయ్యడంతోనే, అరవింద వాకిట్లోకి వెళ్ళి అతనిచ్చిన టెలిగ్రాము నందుకొని, ఒకకాగితంమీద సంతకంచేసి ఈయగా పోష్టుజవాను వెళ్ళిపోయినాడు.

"టెలిగ్రా మొచ్చిందో—" అని అంటూ అరవింద ఆకవరును పట్టుకొని—రేణుక ఉన్నగదిలోకి వెళ్ళింది.

"ఎక్కడనుంచి—త్వరగా విప్పిచదువు-" అని రేణుకఅంటే.

"ఉండు. ఇంక ఈవేళకు మనం స్టుడియోకి వెళ్ళడంపడదు. మీ బావగారికి కారు తీసుకెళ్ళమని డ్రైవరుతో చెప్పివస్తాను." అనిచెప్పి అరవింద ఆకవరును పట్టుకొని వీధిలోకెళ్ళి తిరిగివచ్చి—

"ఒకవేళ మీతాతయ్య దగ్గరనుంచేమోఅని టెలిగ్రాం ఇలాచదివింది."

———

గ

"నీఉత్తరం అందినది. నీకు నాఆశీర్వచనాలు, తాతయ్య." అని టెలిగ్రాము చదవడం పూర్తిచేసిన అరవింద సంతోషంతో అంది.

అవ—ఇంకేం మీతాతయ్యదగ్గరనుంచే వచ్చింది టెలిగ్రాం.

రేణు-ఉత్తరమైతే త్వరగా అందదని టెలిగ్రాం నిచ్చాడుకాబోలు.

అర——అవునుమరి. ఆయనదగ్గరనుంచి వార్త వచ్చేవరకూ నీమ నస్సుకు స్థిమిత ముండదనీ రాశావుగా? మీతాతయ్యకు నీయందెటువంటి వాత్సల్యముందో ఈటెలిగ్రామే చెబుతూంది.

రేణు——ఆయనతో చెప్పకుండా నీతో యిలావచ్చేసినందుకు నా ముఖము నాయన జన్మజన్మాలకూ చూడడని నేనెంతగానయినా భయప డ్డాను. ఈటెలిగ్రాములో నాభయం తీరిపోయింది. నాగుండెలు వేగంగా కొట్టుకోవడమూలేదు. ఆయన ఈటెలిగ్రాము నిచ్చేసి వూరుకుంటారా వెంటనే ఉత్తరమునుకూడా వ్రాస్తారంటావా అరవిందా?

అర-అయ్యో! ఉత్తరమును వ్రాయరుమరీ! నీహృదయారాటాన్ని జ రుగుగా తగ్గించాలనే వుద్దేశంతో ముందుగా ఆయన ఈటెలిగ్రామునిచ్చా రు. రేపో యెల్లుండో ఆయనదగ్గరనుంచి ఉత్తరంకూడా వస్తుంది.

రేణు——ఆయన నాయందల క్రోధమునే గలిగివున్నారో-త్రొల్లిటి వాత్సల్యమునే కలిగివున్నారో వారు రాయబోయే ఉత్తరాన్ని బట్టి సులు వుగా తెలుసుకోవచ్చు.

అర——అంతవరకూ యెందుకూ? ఆయన ఉదారబుద్ధి ఈటెలి గ్రామువల్లనే తెలుస్తుంది. నువ్వుగావించిన పనికి ఆయన క్రోధమునే ఇచ్చి వుండరు ఒకవేళ ఇచ్చినప్పటికీ ఈధ్వనివుండదు.

"నీకు నాశీర్వచనములు." అని ఆయన నిండుహృదయంతో ని న్నాశీర్వచరిస్తూ వున్నప్పుడు నువ్వు ఏఅంభిప్రాయము నెందుకుపడాలి ను వ్వుతలచినట్లుగా ఆయన నువ్విలా చెప్పకుండా వచ్చేసినందుకు మొదట ఏమాత్రమయినా క్రోధమును కలిగివున్నప్పటికీ-నీఉత్తరమును చూడ గానే ఆయన లేతహృదయం పూర్తిగా ద్రవించివుంటుందని చెప్పవచ్చును

రేణు-మాచెల్లాయి దొడ్డమ్మఇంకా పిఠాపురం మొచ్చిందో లేదో కాకపోయినట్లయితే తాతయ్య హోటలు మెతుకులు తినాలి ఆయనకసలే పళ్ళులేవు ఆమేకవంటి హోటలు మెతుకుల తిని ఏమయిబ్బందిపడుతున్నా

డోఏమిా! చెల్లాయమ్మకు వెంటనే ఉత్తరం రాసి, ఆమెను రప్పించవలసిం దనికూడా ఉత్తరంలో రాశాను. మాతాతయ్య ఉత్తరము చూడగానే ఆవిశవచ్చిందో లేక కూతుర్ని విడిచిపెట్టి రాలేక అక్కడనే వుండిపోయి నదో! ఆయనదగ్గరనుంచి ఉత్తరమొచ్చేవరకు ఇటువంటివివరాలే తెలియవు

అర—అక్కర్లేదు. రేణుకా! నువ్వు అటువంటి ఆమర్దాలేమిా పెట్టుకోకు. కొద్దిరోజుల్లో అంటేనీకు ఏదయినా సంబంధం ఏర్పడ్డాక, మిా తాతయ్యగారినికూడా యిక్కడకే రప్పిద్దాములే.

రేణు—నువ్వటువంటి ఉదారగుణ సంపన్నురాలవే అరవిందా! అందుకేమిా సందేహంలేదు. కాని మాతాతయ్యకు నేనంటే అమితవాత్సల్యం. చిన్నప్పుడే తల్లితండ్రీకూడాపోతే కనురెప్పల్లో గట్టుకొని పెంచాడు. నాకోసమే తానింతవరకూ బ్రతుకుతున్నాడని చెబుతూవుండేవాడు. తగినంత కట్నమునిచ్చి నాకు పెళ్ళిచెయ్యలేకపోతినిగదాఅని కుమిలికుమిలి దుఃఖించేవాడు సప్తజన్మాలెత్తినా మాతాతయ్యలాంటి తాతయ్య నాకు దొరుకుతాడా అరవిందా? మనయిద్దరకూ వుండేస్నేహం కొద్దీ-నిన్ను విడిచివుండలేక నీమాటతోసెయ్యలేక తాతయ్యతో చెప్పకుండానిలా వచ్చేశానేగాని, లేకపోతే తాతయ్యను విడిచివస్తానా? కురరితనంకొద్దీ ఇలా చేసివుంటా నసుకొని ఆయన నాయెడల యెప్పటివాత్సల్యమునే చూపుతున్నాడు. ఈవేళ నిద్రలేవగానే నీముఖమునే చూశాను అరవిందా! అంచాకనే యింతటి చల్లనికబురు నాచెవుల్లోపడింది.

అర— అదో పిచ్చినమ్మకం. సరిలే ఏదయితేనేం? ఇప్పటికయినా నీమనస్సు కుదుటపడింది. నాకదేపదివేలు మిాతాతయ్యదగ్గరనుంచి ఉరుములేవడతాయో-పిడుగులే పడతాయోనని హడిలిపోతూవున్నావు.యిప్పటినుంచిఅయినా కడుపునిండా అన్నంతిని ఖులాసాగావుండు.

రేణు—నీతో వున్న నాకు ఖులాసాగాక ఏముంది అరవిందా?

అర—ఈమాటలన్నీ యింతకుముం దెక్కడికి వెళ్ళాయి. తాతయ్య గారితో చెప్పకుండా వచ్చేశాను, వేళకు తిండితినకుండా-కాఫీతాక్కుండా

ఓమూల కూర్చునేదానవు ఖన్నురాలవై.

రేణు—ఆఁ! అంతా బడాయిలెద్దు.

అర-నువ్వు వెయ్యి చెప్పు—లక్ష చెప్పు. ఈటెలిగ్రాము వచ్చినప్పుడు వికసించినట్లుగా నీముఖ మింతకుముందెప్పుడూ వికసించి వుండలేదు.

రేణు—పోనీ నువ్వలాగే అనుకో.

వారిద్దరూ అలా మాట్లాడుతుండగా ఇంతలో వీదిలో కారుఆగిన చప్పుడయింది.

అం—అదుగో! మీబావగారుకూడా వచ్చేరల్లేవుంది. నామాట అబద్ధమయితే వారిచేతకూడా అనిపిస్తానుండు.

బెనర్జీ కారుదిగి లోపలకొచ్చి తలమీదనున్న హేటునుతీసి, సావిట్లో నిశ్చలంగా కూర్చొనివున్న అరవి:ద ముఖంలో కొకసారి రేణుకముఖంలో కొకసారి చూచి, బూటులేసులను విప్పుకుంటూ అక్కడనేవున్న ఒక పేముకుర్చీలో కూర్చున్నాడు.

అర—ఏమండీ! ఒకమారు రేణుక ముఖంలోకి చూడండి.

బెన—(చూచి) చూశాను. ఏం?

అర—ఇంతకుముందు రేణుక ముఖానికీ-ఇప్పటి రేణుముఖానికీ ఏమయినా తేడావున్నట్లుగా తోస్తుందా?

బెన-ఆఁ! రోజూకంటె ఈవేళ రేణుముఖం మంచిఖులాసాగా వున్నట్లుంది.

అర—(నవ్వుతూ) విన్నావా రేణుకా! మీబావ ఏమంటున్నారూ? నేనామాటలను అయున్నా అనమన్నానా చెప్పు.

బెన—ఏమిటి విశేషం?

అర-తాతయ్యగారి దగ్గరనుంచి టెలిగ్రామొచ్చింది. అనిఅంటూ అరవింద బల్లమీదవున్న టెలిగ్రాం కాగితాన్ని భర్త కందించింది.

బెన—(చదివి) ఓ! ఇదాసంగతి! ఇంకేం! ఈవేళ మనఅందరకూ టీపార్టీ అన్నమాట తాతగారిదగ్గరనుంచి ఎటువంటి ఉత్తరమొస్తుందో అనీ, పెనుగాలి కల్లాడే సనుతీగలాగ ఒణికిపోతుండిసిల్ల.

అర-ఈరోజుతో ఆమెతోపాటు మనకూ_డా హృదయభారంతగ్గింది

బెన—గాకపోతే నీకిదేంపని అరవిందా! మీయిద్దరకూ ఎంతటిస్నేహమయినా వుండుగాక! చిన్నప్పటినుంచీపెంచి, పెద్దదానినిగాజేసి, అల్లారుముద్దుగాను_అతిగారాబంగా పెంచుకొంటున్న తాతగారితో చెప్పనయినా చెప్పకుండా రేణుకనీవిధంగా తీసుకొచ్చెయ్యడం మంచిపనా?

అర—(నవ్వుతూ) ఏమో కొత్త కాపురము-కొత్త మొగుడూను. రేణుకవంటి స్నేహితురాలయినా దగ్గరలేకపోతే ఏం ప్రమాదమొచ్చేదో!

బెన—ఎంత తెలివిగా మాట్లాడావూ? ఆవృద్ధుడు సద్ధర్ముడుగాబట్టి సరిపోయింది. లేకపోతె మీరుగావించిన ఈతొందరపాటు కార్యానికి మరొకరయితే ముఖమయినా చూశావారా?

అర—ఇకచాల్లెండి. ఇంకెప్పుడూ యిటువంటి తీర్పులు చెప్పబోకండి. మేమింత కానిపనిని దేనినీచేయలేదు. ఇద్దరమూ చిన్నప్పటినుంచీ చదువుకొన్న ప్రాణస్నేహితులముగాబట్టి-ఒకళ్ళనువిడిచి మరొకళ్ళ ముండలేకపోయినాము. అప్పటికీ రేవతి నాతో ఇలావస్తానని తాతగారిని ముదుగా అడిగింది. ఆయన ఆమెయందు తనకుండే వాత్సల్యంకొద్దీ—వెళ్ళడానికి వొప్పుకోలేదు. అందుకని మేమిలాచేశాము. దీనినొక కానిపనిగా ఎంచి మీరుచెప్పనక్కరలేదు. ఇకవూరుకోండి చాలు.

బెన-కోప్పడకండి-యింకవూరుకొంటాను. ఆభార్యభర్తలయొక్క రసవత్తరమైన సంభాషణను రేణుక ఎంతోఉత్సాహంతో వింటూంది.

అర—ఈమాటల కన్నింటికీ యేంగాని, రేణుకకు సంబంధంచూడమని రోజు పోరుతున్నాను. ఇంకా ఎక్కడా చూడలేదా యేమిటి?

బెన—ఆఁ! జ్ఞాపకమొచ్చింది. నిన్నటిరోజున గోదావరిజిల్లానుంచి, మన స్టుడియోకు ఒకయువకుడొచ్చాడు. అతనిపేరు వెంకటేశం. గొప్ప నటకుడు—గాయకుడూ కూడాను. చాలా అందంగా వుంటాడు. ఫిలిముల్లో వేషాలువేయడంవల్ల అతను నెలకు రెండుమూడువందలు సంపాదిస్తాడు. మనిషికూడా చాలా అందంగా వుంటాడు. రేణుకసౌందర్యాన్ని కత

ఎంతమాత్రమూ తీసిపోడు.

అర—అతనికింకా వివాహం కాలేదా యేమిటి?

బెన—లేదు'

అర—అతను మనరేణుకను చేసుకుంటాడేమో అడిగారా?

బెన—తప్పక చేసుకుంటాడు. అతనికి నావల్ల చాలా ఉపకారాలు జరుగవలసివున్నాయి. అందువల్ల నేనెలాచెబుతే అల్లాగే వింటాడు.

అర—అయితే అతన్నొకసారి చూపిస్తారా?

బెన—అల్లాగే

అర—రేపు స్టుడియోకి వెళదామంటారా?

బెన-అక్కర్లే అతన్నే మనింటికి తీసుకొస్తా. చూసి మాట్లాడండి.

అర—రేపు యెప్పుడు తీసుకొస్తారు?

బెన—సాయంకాలం నాలుగుగంటలకు తీసుకొస్తాను.

అర—తప్పక తీసుకొస్తారా?

బెన—తప్పక తీసుకొస్తాను. అతడు మనరేణుకను చూశాడంటే తప్పక వివాహం చేసుకొంటాడు.

అర-రేపు 4 గంటలకు రేణుకను ముస్తాబుచేసి అట్టేపెడతానయితే.

బెన—సరే.

అర—తీరా ముస్తాబయినతరువాత మీరాతన్ని తీసుకురాకపోతే నిరుత్సాహం పడవలసి వస్తుందిసుమండీ! మీరు మామూలు వేళాకోళం కబురు చెప్పారంటే పనికిరాదు.

బెన—లేదు—తప్పక తీసుకొస్తాను.

అర—అతను రేణుకను పెళ్ళిచేసుకోవడానికి ఒప్పుకొంటాడన్న ధైర్యముందా మీకు?

బెన—నీకా గొడవంతా యెందుకూ చూసి నచ్చాడో లేదో మాత్రం నాకుచెప్పు. అంతే తరవాత అతన్నిఒప్పించేపూచీ నాదిసరా?

అర-ఊఁ! కానీయండి. ఇంతాచేస్తే అతను రేణుకకు నచ్చుతాడో నచ్చడో

బెన—వచ్చుతాడన్న ధైర్యంనాకుంది. అని వారు మాట్లాడు కొంటుండగా గుమ్మంలోకొచ్చిన ఒక మెద్రాసు అయ్యరు—

"అమ్మా! చీరలు బలే గొప్పరకాలున్నాయి. దేవికారాణీ చీరలు-మాలపిల్లచీరలు-శాంతాఆప్టేచీరలు-ఇంకా-ఇంకా-చాలా రకాలున్నాయి." అని కూడావున్న కూలిమనిషి నెత్తిమీద ట్రింకుపెట్టెను దించుతూ అన్నాడు.

"సినీమాస్టార్ల పేర్లన్నీ చీరలమీద కెక్కాయా యేమిటి?" అని బెనర్జీ పకపక నవ్వాడు.

"సమయానికే వచ్చాయి ఈచీరలుకూడాను. ఏమయినా మంచిచీరలుంటే రేణుక పెళ్ళిచూపులకు కొంటాను." అన అరవింద అంటే

రేణుక యేమీ మాట్లాడలేదు.

"కొత్తచీర జమాయించి, పెళ్ళికూతుర్ని చేస్తావన్నమాట ఈ వేళ?" అని బెనర్జీ అన్నాడు.

"ఇది కోయంబత్తూరుచేత, ఇది బెంగుళూరు పేటెంటుఈసిల్కు-గళ్ళచీర బహునాణ్యం" అని అంటూ అయ్యరు ట్రంకులోనుంచి ఒక్కొక్క-చీరనే తీసి ఆసావిట్లోఉన్న బల్లపై వేయుడం మొదలుపెట్టాడు అరవింద ఆచీరలనన్నింటినీ నాణ్యంచేస్తూ—

"నీకు ఏచీర బాగుంది రేణుకా?" అంది.

"నాకు తెలియదు—' అని రేణుకఅంటే—

"మీకేచీర బాగుందంటే!" అని అరవింద తిరిగి బెనర్జినడుగుతే

"నేను కట్టుకొనేవాణ్నయితే చెప్పేవాణ్ని" అత డన్నాడు.

"ఎప్పుడూమీకు కొంటివేళాకోళమే మన ముగ్గురకూనచ్చినచీర తీసుకోవాలిప్పుడు." అని అరవింద అన్నది.

"ముగ్గురకూ ఒకటే నచ్చడం సాధ్యమా?" అని బెనర్జీ అడిగాడు

"చూదాం ఏమవుతుందో మూడు కాగితం ముక్కలను ముగ్గురమూ తలొకటీ పుచ్చుకొని ఎవరకి నచ్చిన చీరపేరు వాళ్ళకూ కాగితం

ముక్కలమీదరాసి, తరువాత మూడూ ఒకేసారి విప్పి చూదాము అం దులో ఏయిద్దరు రాసినపేర్లు ఒకటవుతే ఆచీరను కొందాము-" అని అం టూ అరవింద సాదు తెల్లకాగితం ముక్కలు తీసుకొచ్చి,ఒకటి బెనర్జీ కిచ్చి నచ్చిన చీరపేరు రాయమని చెప్పింది. అలాగే రేణుకకొకటిచ్చి తా నొకటి పుచ్చుకొంది ముందుగా బెనర్జి ఆచీటిమీద తనకు నచ్చినపేరును రాసి, ఆచీటిని చిన్నదిగామడిచి ఆబల్లమీదపెట్టాడు. తరువాత రేణుక కూడా చీటీమీద ఏదోరాసి మడిచిపెట్టింది నవ్వుముఖంతో. చివర అర విందకూడా తనకునచ్చిన చీరపేరును చీటీమీద రాసి బల్లమీద పెట్టింది.

"మూడుచీటీలను మీరువిప్పి అందులో ఏమిరాసివుందో చెప్పం డి అయ్యారుగారూ!" అని అరవింద బట్టలవర్తకుడితో అనగా అతనదే విధముగా ఒక్కొక్క చీటీని విప్పి చదివాడు.

"గళ్ళచీర"—"గళ్ళచీర"—"గళ్ళచీర"

'ముగ్గురమూ గళ్ళచీరనే రాసేము' అని అరవింద కిలకిల నవ్వుతూఅంది.

'ఇలాముగ్గురహృదయాలుఒకటవడం చాలాచిత్రంగాఉంది' అన్నాడు బెనర్జి

"ఆగళ్ళచీర ఖరీదెంత?" అని అరవింద సాహుకారు నడిగింది.

"మూడువందలు" అని అతనుచెప్పాడు.

"ముగ్గురమూ కోరినచీర కావడంవల్లనా ఏమిటి మూడువందలు చెబుతున్నావు?" అని అరవింద అంటే—

"అమ్మా! దీనినాణ్య మటువంటిది. అంతా పట్టుతప్ప ఒక్క నూలుపోగయినా లేదు. ఈగళ్ళన్నీ అసలు వెండిజరీగాని కల్తీలేదు. బా బయ్యగారు దగ్గరవుండబట్టి ఈఖరీదు చెప్పాను. మరోచోట ఐతే ఐదు వందలొస్తాయి నాకీగళ్ళచీరకు. ఈమూడువందలలోనూ మూడు రూపా యలకంటే యెక్కువగా నాకుమిగులుతే మహాలక్ష్మితోడు." అని చీర లమ్మేవాడు చీరనుతానే ప్రమాణంచేసి చెప్పాడు

"అంతమాటెందుకులే-" అని అంటూ అరవింద మూడువందల రూపాయలనుయిచ్చి చీరను తీసుకొంది. వర్తకుడు మిగిలినచీరలను తిరిగి

ట్రింకులో సర్దుకొని, ఆముగ్గురకూ నమస్కారంపెట్టి వెళ్ళిపోయినాడు.

"ఆకుపచ్చరంగు పట్టుమీద తెల్లటి వెండిజరీగళ్ళు ఎలా మిల మిల మెరసిపోతున్నాయో! ఈచీర యింతఖరీదు చేస్తుందంటారా!" అని అరవింద భర్త నడుగుతే—

"స్టుడియోలో ఒక సినీ మాస్టర్ దీనినే మూడువందల పాతిక రూపాయలకు కొంది." అని బెనర్జి సమాధానం చెప్పాడు.

"ఐతే మనం టోపీలో పడలేదన్న మాట?" అని అరవింద తిరిగి అంది.

"లేదు—అయ్యరు మనయింటిదగ్గర ఎక్కువధరలు చెప్పడు." అని బెనర్జి ఒప్పుకొన్నాడు.

"ఈచీరను కట్టుకొని రేణుక కాబోయే భర్త ముందు నిలుచుం టే ఎలావుంటుందంటారు?" అని అరవింద భర్త నడిగింది.

"రంగడు కుచ్చులా వుంటుంది." అని అతను సమాధానం చె ప్పగా అరవింద కిలకిల నవ్వింది.

'పోబావా! నీకెప్పుడు వేళాకోళమే.' అని రేణుక గుణుస్తుంటే—

'అవును రేపు నేనేపోతాను కొత్త మొగుణ్ని కట్టుకొని' అని బెనర్జిఅన్నాడు

"ఉండండి మీరుదాన్ని అట్టే వేళాకోళం చెయ్యబోకండి. రా రేణుకా మనం మేడమీదికి వెళ్ళిపోదాము. పసుపుబొట్టుపెట్టి చీరనుకట్టు కొని చూదువుగాని ఎలావుందో" అని అరవింద ఒకచేత్తో గళ్ళచీరను మ రోచేత్తో రేణుక చెయ్యిని పట్టుకొని మేడమీదికి తీసుకెళ్ళింది.

———

## ౬

"వరుసగా మూడురోజులనుంచి కలలోకి వస్తుందిచెల్లెమ్మా!"

"రేణుకేనా అన్నయ్యా!"

"అవును చెల్లాయమ్మా! కన్ను మూసేటప్పటికల్లా కళ్ళల్లోకొ



స్తుందిపిల్ల ఎలావుందో ఏమిటో! నాతల్లి నాకళ్ళ కెప్పుడగపడుతుందో!

"నువ్వురాసిన ఉత్తరం దానికీపాటి కందేవుంటుంది. రేపో ఎల్లుండో సమాధాన మొస్తుందిలే."

"నాతల్లి నన్ను విడిచిపెట్టిపోయి ఇప్పటి కారుమాసా లయింది. ఈఆరుమాసాల్లోనూ నాకళ్ళు కాయలుకాసి పోయినాయి."

"ఆడపిల్లను తగిన భయభక్తులలో ఉంచక పోయినట్లయితే ఇటువంటి ముప్పులే వస్తుంటాయి మనంఅనవసరంగా దానిమీద భ్రమపెట్టుకొని వుండడమేతప్ప రేణుకఆశ మనకులేదింక."

"అలా అంటున్నావేం చెల్లమ్మా!"

"నీకుమాత్రం తెలియని దేముందన్నయ్యా! దానిమీదవుండే మమకారంకొద్దీ అలా పారికలాడడంతప్ప వేరే ప్రయోజన మేమీలేదు. అన్యకులస్తుణ్ని వివాహంచేసుకొన్న అరవిందతో పోయిందది. పెద్దవాడయిన నీతోనయినా చెప్పకుండాను.

"కుర్రతనమంటే యేమిటిచెల్లమ్మా!"

"కుర్రతనంగాదు——పెంకితనమను."

"తలిదండ్రులులేని పిల్లను కడుపులో పెట్టుకొని పెంచినాను. ఏమనుకున్నావు చెల్లమ్మా!"

"నాకేదుకన్నయ్యా! చిన్నప్పటినుంచీ తగిన భయభక్తుల్లో పెట్టకోవడం నీకు చేతనయిందిగాదు. ఈవేళ అన్యకులస్తుణ్ణి చేసుకొన్న అరవిందతో పోయింది. రేపు అదేయింకో అన్యకులస్తుణ్ని చేసుకుంటే అప్పుడుకూడా మనమీలాగున నోరుమూసుకొని ఊరుకోవలసిందేగా!"

"అదయిన చిన్నపిల్లగాదు-అజ్ఞానురాలుగాదు. దాని బాగోగులు చూసుకొని అదిచేసుకొనేపనిని మనమెలా అడ్డుపెడతాము చెల్లెమ్మా."

"అయితే దానికోసమిలా విచారిస్తూ కుళ్ళి కృశించకమొందుకు పోతే పోయిందని వూరుకోకూడదూ?"

"పెంచిన మమకారం ఊరుకోనియ్యదే చెల్లెమ్మా! అదివెక్కడికు

వెళ్ళిపోయినా, ఏపనిచేసినా, ఆపెంచిన ప్రేమపాశం నన్ను విడిచిపెట్టదు. మొన్న మొన్నటిదాకా గుండెలమీద పడుకొని నిద్రపోయిన వాత్సల్యాన్ని చంపుకోవడ మెల్లాగు చెల్లామ్మా

'ఇప్పటికిప్పుడే గ్రామమంతా అట్టుడికిపోయినట్లుగా ఎలా వుడికిపోయిందో నువ్వేమయినా కనిపెట్టావా?'

'ఎందుకు చెల్లమ్మా?'

'ఎందుకని యింకా మెల్లిగా అడుగుతున్నావా అన్నయ్యా! ఫలానా నవీనచంద్రంగారి మనుమరాలయిన రేణుక, కులంచెడిన అరవిందతో ఎవరితోనూ చెప్పకుండా పారిపోయిందని చెప్పుకుంటున్నారు. నవీనచంద్రం. మనుమరాలు గావించిన తప్పు పనికి హర్షించి వూరుకున్నాడు గాబట్టి అతన్ని కులంలో వెలివెయ్యవలసివుంది—అని మన సంఘంలోని ప్రజలందరూ అనుకుంటున్నారు."

'పోనియ్యవే చెల్లమ్మా! ఈసంఘంమాటా—ప్రజలమాట—నామాయందు చెప్పకు నామనుమరాలిని అయిదువేల కట్నమిస్తేనేగాని, పెళ్ళిచేసుకోనన్న ఈసంఘంలోని పెద్దమనుష్యులకు, దాని మంచిచెడ్డల మాట మాత్రం ఎందుకు గావలసి వచ్చిందీ?'

'అది సంఘాచారం రా అన్నయ్యా! ఈకట్నాల ఆచారం ఈవేళా నిన్నా వచ్చిందా? మనదగ్గర డబ్బులేదుగాబట్టి అలా అనుకుంటున్నాము మనదగ్గరే ఒకచక్కని మగపిల్లవాడుండనియ్యి—అప్పుడు మనం కట్నం పుచ్చుకోవడం మానామా!'

'అలా అనకు చెల్లమ్మా! కట్నాల ఆచారమువుండగా అని, యింకమంచీ చెడ్డ చూడనక్కరలేదూ?' 'ఉన్నకాస్త కొంపనూ అమ్మేసి, దానవచ్చిన రెండువేల రూపాయిలూ యిస్తానన్నాను లేనా-ఆకొంపనే దానవిక్రయానికి అధికారాలతో వ్రాసియిచ్చేసి, పిల్లను చేతిలోపెట్టి నమస్కారం చేస్తానంటే ఒప్పుకోగూడదూ? ఉహుం! అయిదువేలకు కానిడబ్బు తక్కువయితే పనికిరాదని పట్టుపట్టి కూర్చున్నారందరూను. ఇది

న్యాయంగా వుందా చెల్లమ్మా?'

'పోనిద్దన్నయ్యా! యేదో అయిపోయింది.'

'పోనియ్యక చేసేదేముంది చెల్లమ్మా! నన్నూ నాపిల్లనూ నుంచి వేరు చేసిందీ సంఘమే. నాకేలును ఎవరయినా నేపిచ్చిన దానిని పుచ్చుకొని, వివాహం చేసుకొంటే, నాతల్లికీ నాకూ ఈవిధంగా యెడబాటు కలిగేదా? ఆదంపతులిద్దరూ చిలకా గోరింకలులాగున నాకళ్ళయెదుట మసులుతుంటే చూడామని నేనెంతగా ముచ్చటపడ్డాను? అరవిందమాత్రం ఈవర్ణాంతరవివాహం చేసుకోడానికి సంఘమే కారణంగదూ?

ఆదిక్కూ లేని పిల్ల, పాపం! అక్కడాయిక్కడా యాచనచేసుకొని,చదువుకొంది ఆచదువుకున్న రోజుల్లో ఆపిల్లను పెళ్ళిచేసుకోవడానికి ఏమంటి పెద్దమనిషి ఎవడయినా వచ్చాడా? అరవింద దిక్కూలేనిపిల్లఅనీ అనాథపక్షి అనీ తగినంతకట్నము నీయడానికామె తాలూకెవరూ పెద్దదిక్కులేరనీ అందరూ ఆడిపోసుకున్నారేగాని ఆమెను పెళ్ళిచేసుకోడానికొక్కరూ వచ్చినవారులేరు. ఆపిల్లకు గోత్రంతక్కువా? కులంలేదా? ఏమంటి బ్రాహ్మణపిల్లగదా, ఎవరయినా ఆమెను పెళ్ళిచేసుకొని ఆమెజీవితాన్ని సార్థకం చెయ్యగూడదూ?"

"చేసుకోకపోతేమాత్రం ఓపికపట్టి వుండలిగాని, కులంగాని కులంలోనిమనిషిని తీసుకొచ్చి పెళ్ళిచేసుకుంటుందా? నువ్వుకూడా అలాగున అంటావేమిటి అన్నయ్యా! పెద్దవాడవు అన్నీ తెలిసినవాడవు కూడాను."

"ఏంచెయ్యమంటావు చెల్లెమ్మా! పోయినతలిదండ్రులు పోగా పురుషసాహాయ్యం లేకుండా ఎంతకాలమని కన్యగా వుండిపోతుందీ? ఆమిషనుకొట్టులో పనిచేసుకొని, దానిబ్రతుకు అది బ్రతుకుతున్నా - ఈసంఘం సహించి వూరుకోలేదే. ఆడదానికి ఉద్యోగమేమిటనీ- తెగించిన ఆడదనీ— ఎవరికితోచినట్లల్లా వాళ్ళు ఆడిపోసుకున్నారు. ఏమీచెయ్యకపోతే ఆపిల్లకు పొట్ట ఎలాగడుస్తుందో ఆలోచించరు. తీరా మోసి దేహీఅని ఎవరిగుమ్మంలోకి వెళ్ళినా ఎవరూ గుప్పెడుగింజలయినా పెట్టరు.

'భగవంతుడిచ్చిన కాళ్ళు చేతులుండగా మనకిముష్టి ఎవరువేశతారు? '

"పెట్టినప్పుడీ అనవసర ప్రసంగాలన్నీ ఎందుకీసంఘానికి. వాళ్ళు పెట్టరు-ఆపిల్ల ఏదో చేతిలోవున్న పనివల్ల బ్రతుకుతుంటే నోటికొచ్చినట్ల ల్లా వాగుతారా? ఈసంఘానికిదేమిన్నైజం? ఈప్రజలకిదేంబుద్ధి? అరవింద రోడ్డుమీాద నడవడం భయంగావుండేదిగదా! ఏర్పాటయినా చచ్చినా ళ్ళందరూ ఎవరికితోచినట్లుగా వారు కూసుకునేవారు. పాపమా మానవతి ఎవరెన్ని అనుకొంటున్నా వినకుండా తనమార్గానతాను వెళ్ళిపోయేది'

"పోనిద్దన్నయ్యా! ఆగొడవలన్నీ మనకెందుకు మొన్న రేణుకకు ఏమని ఉత్తరం రాశావో నాకు చెప్పనయినా చెప్పలేదే!"

"అయ్యో! చెప్పలేదు చెల్లెమ్మా! మరచిపోయానుగాబోలు.ఆ ఉత్తరంయొక్క చిత్తుకాఫీ పరుపుకిందవుంది. తీసుకురా చదివివినిస్తాను." అని నవీనచంద్రుడనగానే చెల్లాయమ్మ మరొక గదిలోకి వెళ్ళి అన్నగారుచెప్పిన విధంగా ఆగదిలోవున్న పరుపుకిందనుంచి రేణుకు వ్రాసిన ఉత్తరంయొక్క నకలును తీసుకొనివచ్చి, ఈయగాఅతడు దానిని ఈవిధంగా చదివి చెల్లెలికివినిపించడం మొదలు పెట్టాడు-

'చిరజీవి సౌభాగ్యవతియగు రేణుకకు—

తాతయ్య ఆశీర్వదించి వ్రాయునదియేమనగా—

అమ్మా! నాలు గయిదు రోజులక్రితం నువ్వు కలకత్తానుంచి వ్రాసిన ఉత్తరము చేరినది నీయొక్క క్షేమం తెలిసి అపరిమితానంద భరితుడ నయినాను. తల్లీ! నువ్వు రాత్రికి రాత్రి చెప్పకుండా వెళ్ళిపోయి నందుకు నాహృదయమెంతగా కొట్టుకొన్నదో నీకు తెలియునుగదా! నువ్వు అరవిందతో కలకత్తా వెడతానని నాతో చెప్పినప్పుడు, అందుకు నేను సమ్మతించక పోవడానికి గల కారణము నిన్ను విడిచిపెట్టి వుండలేక పోవడంతప్ప యింకేమీా లేదమ్మా! అరవింద నిన్ను సోదరి ప్రాయంగా చూస్తుందనీ—నాకంటే యెక్కువవాత్సల్యంతో కనిపెడుతుందనీకూడా నాకు తెలునును. అయితే ఇంతవరకూ నిన్ను విడిచి ఒక్కక్షణమయినా వుండలేదమ్మా, మొ

వ్వాడూను. అదీగాకుండా పదహారేళ్ళనించు యౌవ్వనంలోవున్న కన్యవుగదా, నేడుగాకపోతే రేపయినా ఏసంబంధమైనా కలిసిరాకపోతుందా? నీపెళ్ళిని చేతులారా చేసి ఆనందించలేక పోతానా, అనే ఆశతోవున్నానుగాబట్టి, నిన్నింకో చోటకు పంపడాని కిష్టపడలేక పోయినానుతల్లీ!

నువ్వు ఇల్లువిడిచిపెట్టి వెళ్ళిపోయింది మొదలుకొని, తిరిగి నీదగ్గర నుంచి ఉత్తరం వచ్చేవరకూ నాకళ్ళంట ఎన్నికడవలనీళ్ళు కారాయో ఎవరు చెప్పగలరూ? ఈవిషయమంతా చెల్లాయమ్మకు రాశాను. అదికూడా నీదగ్గరనుంచి ఉత్తర మొచ్చిననాడేవచ్చి సంగతి సందర్భాలన్నీ తెలుసుకొన్నాక అదికూడా చాలా విచారించింది. నీఉత్తరం చూసుకొన్నాక మాయిద్దరప్రాణాలూకూడా స్తిమితపడ్డాయి. అంతవరకూ ఏమైపోయినావో-ఎక్కడున్నావో అన్న ఆదుర్దాతోనే మాప్రాణాలు కొట్టుకుపోయాయమ్మా! నీఉత్తరం అందగానే వెంటనే వార్త తెలుపుమన్నావుగదా అని తంతినిపంపాను. అదినీకు చేరేవుంటుంది. నువ్వు ఎక్కడున్నా, క్షేమంగా వుండి, పదికాలాలపాటు సంతోషంతో వుండడమునే ఈపెంచిన మమకారం కోరుతున్నదితప్ప యింకేమీలేదు. నిన్ను చూడాలని చాలాభ్రమగ వుందమ్మా! దగ్గరా దాపా? పోనీ ఓసారివచ్చి చూసిపోదామన్నా బో లేడంత దూరముగదమ్మా తల్లీ! అరవిందకు నాఆశీర్వచనాలని చెప్పు మీయిద్దరూ ఎక్కడనో ఒకచోట ఖులాసాగావుంటే నాకదేపదివేలు.

ఇట్లు — నవీనచంద్రుడు.'

అని తానింతకుముందు [illegible]సి ఉత్తర మొక్క నకలును నవీనచంద్రుడు చెల్లాయమ్మకు చదివి వినిపించడమును పూర్తిచేశాడు.

— —

౨

ఆనాటిసాయంకాలం బెన్జ్ స్టుడియోనుంచి వచ్చి రావడంతోనే 'పెళ్ళికొడుకు నచ్చినట్లేనా?' అని అరవింద నడిగాడు.

'కుర్రాడు బాగానేవున్నాడు కాని-' అని అరవింద ఇంకా ఏమో చెప్పబోగా

మూర్ఛపోతారు. అదేపదిమాట్లు అలాఅంటే దిష్టితగులుతుందేమోగూడాను. ఈనాటి గళ్లచీర ముస్తాబులోని రేణుకముందు ఏరంభా ఊర్వశీ కూడా పనికిరాదంటే నమ్మండి స్త్రీఅయిన నాక్కూడా వలపుపుట్టించే ఆమె రూపసంపద నెవరు వర్ణించగలరూ? పెళ్లికొడుకూ మీరూ వెళ్ళిపోయిన అనంతరం రేణుక నెంతసేపుచూసినా నాకు భ్రమ తీరిందిగాదు. మీరునామాటలు నమ్మినాసరే-నమ్మకపోయినా సరే అప్పుడింక నేనేంచేశానో మీకు తెలుసామరి. నిలువుటద్దం ముందునిలుచుని తనముస్తాబు సౌరభ్యాన్ని తిలకించుకొంటూవున్న రేణుకను గట్టిగా కౌగలించుకొని నాసరదాఅంతా తీర్చేసుకొనేటట్లు ఒక్కసారి ముద్దుపెట్టుకొన్నాను.'

"నయమే! ఇంకేమయినా చేశావుగాదు."

"పోండి పాడుమాటలూ మీరూను."

"పాడుపనులుచేసిన నువ్వు బాగానేవున్నావు."

"నేనేం పాడుపనులు చేశానూ?"

"ఈచేసినపని పేరేమిటో! ఆడవాళ్ళను ఆడవాళ్ళు కౌగలించుకొని ముద్దుపెట్టుకోవడం మెక్కడయినా విన్నావా?"

"బాగుంది. సౌందర్యాస్వాదనకు ఆడ మగ వివక్షణవేమిటి? ఇప్పుడొక చిన్న లేగదూడ ఎంతో అందంగా మనకళ్ళకు కనిపిస్తే, దాన్ని మనం ముద్దుపెట్టుకోమూ? అల్లాగే ఒక గులాబీపువ్వనుకోండి- మామిడిపండనుకోండి. ఇల్లాగే మరోటీ-మరోటీకూడా అనుకోండి. అన్నింటికీ ఏంగాని ఆగళ్ళచీర చాలా బాగుందంటే! నేనుకూడా ఒకటికొంటాను."

"ఈసారి అపావాలుకారు వచ్చినప్పు డలాగే కొనవచ్చును. కాని నువ్వుచెప్పిన సిద్ధాంతాన్నిబట్టి, ఆగళ్ళచీర ముస్తాబులోవున్న రేణుకయొక్క అపురూప సౌందర్యాన్నిచూస్తే నాక్కూడా ముద్దుపెట్టుకోవాలన్న కోరిక కలుగుతుందేమో!"

"కలుగుతే పెట్టుకోండి. సిద్ధాంతమన్నాక అందరకూ ఒకటే. ఆవిషయంలో నాకెటువంటి అభ్యంతరమున్నూ లేదు. రేణుకను పిలవ

మన్నారా ముద్దు పెట్టుకోందురుగాని—"

"నీ కభ్యంతరం లేకపోతే-ఆమెకు లేకుండావుంటుందా? నిజంగా అన్నంతపనీ జరుగుతే రేణుక కాలిజోడు తీసి కొడుతుందేమో!"

"పదండి-దానికి నేనేంజేస్తాను. సుఖమనుభవించినప్పుడు-కష్టం కూడా దాని వెనువెంటనే వుంటుందన్న విషయం మీకు తెలియనిదిగాదు

"అయితే యిప్పుడు రేణుక నొకసారి ముద్దుపెట్టుకొని-ఆమెచేత రెండు చెప్పుదెబ్బలు తినమంటావు ఇదేగా నువ్వు చెప్పేది?"

"బాగుంది. మీకందు కిష్టమయితేనే, లేకపోతే నేను మిమ్మల్ని నిర్బంధ పెట్టడంలేదు.

"సరే. ఏదో చేదాము. ముందుగా దొడ్లోనుంచి రేణుకను పిలు. ఆమెను దొడ్లోనూ-నన్నిక్కడా పెట్టే ఊరిస్తున్నావు నువ్వు?"

'అబ్బో! మగవాళ్ళేపనికయినా తయారే. రేణుకను పిలుస్తానుగాని, కొంపతీసి అన్నంతపనీ చేశారుసుమండీ! రేణుకసలే పెంకితనమెక్కువ"

"ఎవరికయినా రెండు నాలికలు పనికిరావు."

"మీరన్నింటికీ తయారే." అని పకపక నవ్వుతూ అరవింద—

"రేణుకా!—రేణుకా!" అని దొడ్లోవున్న రేణుకను రెండుసార్లు పిలిచిదిం. రేణుక వెంటనేవచ్చి అరవిందకు దగ్గరగా నిలుచుంది.

"ఏమిటమ్మా! నీకెందుకొచ్చిన శ్రమయిది. పనిమనిషి పొయ్యదూ మొక్కలకునీళ్ళు? ఎన్నిసార్లు చెప్పినా నామాట వినవుగదా! నీచేత మొక్కలకు పోయిస్తున్నానని మీబావగారు నన్ను కూడా కోప్పడుతున్నారు." అని అరవింద అంటే-లేదుబావా! అక్క మొక్కలకు నీళ్ళుపోయవద్దని నాకు చెబుతూనేవుంది. కాని ఆపని చెయ్యడమంటే నాకుసరదా!

"అరవిందా! నువ్వు చెప్పినదాంట్లో ఏమీఅతిశయోక్తి లేదు. ఈ గళ్ళచీర ముస్తాబులోవున్న రేణుకముందు మేనక-తిలోత్తమా—కూడా పనికిరారు." అని బెంగ్జీ అంటే—

"పో బావా! నువ్వలా వేళాకోళంచేస్తే—ఇప్పుడే ఈచీరను

విప్పేస్తాను. ” అంది రేణుక.

“ నీ పుణ్యమా అని అంతపని మాత్రం చెయ్యకుసుమా ముందు’ అని బెనర్జీ అంటే అరవింద విరగబడి నవ్వడం మొదలు పెట్టింది. బెనర్జీ కూడా ఆపుకోలేక ఆమెతో సమంగా నవ్వాడు.

“ అబ్బా! చూడనమ్మా అరవిందా! బావ యెటువంటి కొంటె మాటలాడుతున్నాడో! అని రేణుక అరవిందజడను పట్టుకొని లాగింది.

“ ఇది అన్నిటికంటే బాగుంది. వారు చేసినపనికి నాకావిధి శిక్ష? అంతగట్టిగా లాగుతే నొప్పిపుట్టదుటమ్మా! ” అని అరవింద దొంగబాధను అభినయించింది.

“ ఈ ఊసులన్నిటికీ ఏంగాని రేణుకా! ఇందాకా వచ్చిన పెళ్ళికొడుకు నీకు నచ్చాడో లేదో నాతో రహస్యంగా చెవులో చెప్పు ” అని బెనర్జీ రేణుకను లాలించి అడిగాడు.

“ అంత రహస్యంగా చెప్పడానికి నాకేమయినా దొంగభయమా యేమిటి? ” అని రేణుక ధైర్యంగా అంది.

“ ఐతే చెప్పు. ఇంక సందేహమెందుకు? ” అని అరవింద అంది

“ ఏమని చెప్పాలి? ” అని రేణుక తిరిగి ప్రశ్నించింది.

“ అతను అందంగా వున్నాడా? ” అంది అరవింద.

“ అతనిలో ఏమయినా లోటుంటే చెప్పు. ” అని బెనర్జీ.

“ ఏమీ లోటులేదు. అతను అందంగానే వున్నాడు. ” అని రేణుక ధైర్యంచేసి అనేసింది.

“ అయితే అతను నీమనసుకు నచ్చాడన్నమాటేనా? ” అని అరవింద స్పష్టంగా అడిగింది.

“ అది వేరేమాట! ” అని రేణుకఅంది.

‘అత నందంగా వున్నాడని నువ్విప్పుడే గ అన్నావు? ” అని బెనర్జీ

“ అందంగావున్న వాళ్ళందరూ మనస్సుకు నచ్చుతారన్న సిద్ధాంత మెక్కడయినా వుందా యేమిటి? ” అని రేణుక ప్రశ్నించగా, బెనర్జీ

అరవింద లిద్దరూ ఒకరిముఖాలకేసి ఒకరు తెల్లబోయి చూసుకున్నారు.

'ఐతే ఇప్పుడింతకూ తేలిన విషయమేమిటి?' అని బెనర్జి.

"ఇంక తేలడానికేముంది? అతను అందంగానే వున్నాడుగాని, రేణుకకు అతనిపై మనసుపోలేదు." అని అరవింద రేణుక చెప్పినదానికి వ్యాఖ్యానంచేసి చెప్పింది.

"అంతేనా రేణుకా!" అని బెనర్జి ఆమెను రెట్టించి అడిగాడు. అంతే నన్నట్లుగా రేణుక తలను వంకించింది.

"అభిప్రాయం తెలిపోయినాక, యి[redacted]

పెట్టకండి మరోసంబంధం చూదా[illegible] ది అరవింద.

నేనీ విషయమును ముందు[illegible] అనుమానించి, ఇంతకుముందే వివాహం కావలసివున్న ఒకస్నేహితుణ్ని వెంటనే రావలసిందని ఇంతకు ముందే మదరాసు ఉత్తరంరాశాను. నేడోరేపో అతనుకూడా దిగుతాడు అనిఅంటు బెనర్జి ఆగదిలోనుంచి మరియొకగదిలోకి వెళ్ళాడు. తరువాత ఆపెళ్ళిసంభాషణను మళ్ళించేదామనేఉద్దేశంతో రేణుక అరవిందతో అంది

"తాతయ్యదగ్గరనుంచి ఉత్తరమొచ్చింది నువ్వు చూశావా?"

"లేదుగా! నువ్వే చెప్పావు అందులోని సంగతులన్నీని."

'తాతయ్య ఉదారగుణాన్ని నాకిప్పుడిప్పుడు బోధపడుతున్నాయి.'

"నిజంగా ఆయన చాలా యోగ్యుడు.'

"గాకపోతే, నేను తనతో చెప్పనయినా చెప్పకుండా యిలా ఇల్లువిడిచి వచ్చేసినందుకు మరొకరయితే ఎంతకష్ట పెట్టేవారూ? ఆఉత్తరానిబట్టి నామీద అణుమాత్రం ఆగ్రహం లేనట్లుగా కనిపిస్తూంది.

'ఈవిషయం ఆయనఇచ్చిన టెలిగ్రాముని చూసినప్పుడే నేననుకొన్నా

'నిన్ను మరీ మరీ అడిగానని తాతయ్య ఆఉత్తరంలో రాశారు.'

'ఆయనకు నేనంటేకూడా చాలాదయ.'

'నువ్వు నాకెటువంటిలోటున్నా చెయ్యవనీ_నేను నీదగ్గరవున్నా ఆయనదగ్గరవున్నా ఒకటేననీ ఆయనకు నమ్మకం.'

'నాయుడాయన కటువంట గౌరవభావమున్నమాట నిజం"

"మా చెల్లాయమ్మవచ్చి, యిప్పుడు తాతయ్యగారి దగ్గరనే వున్నదటకూడాను."

"పోనీ పాపం అవృద్ధాప్యంలో ఒహాటలు మెతుకులు తినవక్కర లేకుండా సమయానికి చెల్లెలువచ్చి దగ్గరవుంది."

"ఆమెకు ఉత్తరం రాయడంతోనే ఆమె అన్నగారిదగ్గరకొచ్చి వుంది. నాక్కూడా తాతయ్యను చూడాలన్న భ్రమగావుంది అరవిందా"

"అయన్ను కూడా ఇక్కడకురమ్మని ఉత్తరంరాదామా?"

"అయనరాడు అరవిందా-నీకు పురుడువెళ్ళాక నేనే వెళ్ళివస్తాను'

"అబ్బా! డోకువస్తూంది. గదిలోకివెళ్ళి అరమారులోవున్న ఆ ల్బాకరావళ్ళు త్వరగా తీసుకురా రేణుకా! త్వరగా రావాలి—"అని గర్భవతిఅయిన అరవింద డోక్కోవడానికి, కడుపుపట్టుకొని దొడ్లోకి వెళ్ళింది ఇంతలో రేణుక గ్లాసుతో మంచినీళ్ళు-అల్బాకరావండ్లు తీసుకొచ్చి అరవింద కిచ్చింది. అరవింద డోకలేక బాధపడుతుంటే రేణుక తలనుపట్టుకొని

"నెలలు ముదిరినకొద్దీ కొంతమందికి వేవిళ్ళుతగ్గుతాయి నీకదేమీ కనపడదేమమ్మా అరవిందా! ఎనిమిదోనెలకూడా వెళ్ళింది. వేవిళ్ళు ఇంకా కొంచమయినా తగ్గలేదు." అని రేణుక అంది.

"ఏమోనమ్మా! ఈగండంగడచి బయట పడతానన్న ఆశ నాకేమీలేదు. ఇదివర కున్నప్పటికంటే యిప్పుడు డొక్కలో పోటు యెక్కువయినదికూడాను." అని అరవింద నిరుత్సాహంతో అంది.

"అక్కయ్యా! ఇంకో నెలరోజులుదాకా పురుడురాదుగదా! ఈ లోపుగా రెండురోజులు పీలుచేసుకొని అమరగిరివెళ్ళి ఆయోగికి చూపించుకొని వద్దాము రాగూడదూ! అతను మంత్రజలమిస్తే, అనేకమందికి వ్యాధులు నయమవుతున్నాయట!" అని రేణుకఅంటే—

"అవును ఒకసారి వెళ్ళివస్తే ఆ ఆశకూడా తీరిపోతుంది రేపోమెల్లుండో కారులోవెళ్ళి చక్కావద్దాము రేణుకా!" అని చెబుతున్న

అరవిందకు అప్పటికిక డోకులు రావడం మానేశాయి.

రేణుక మెల్లిగా, ఆమెను తీసుకెళ్ళి గదిలో పరుపుమీద పడుకో బెట్టి ఉపచారాలు చెయ్యడం మొదలుపెట్టింది.

— —

౮

"మొన్నొచ్చిన పెళ్ళికొడుకయిన నచ్చాడా నీకు అని మదరాసునుంచి ఒకవరుడువచ్చి చూసివెళ్ళిన అనంతరం అరవింద రేణుక నడిగింది.

"నామనసులోవున్న అభిప్రాయాన్ని చెప్పెయ్యమన్నావా అక్కయ్యా!" అని రేణుక సందేహిస్తూ అడిగింది.

"సందేహమెందుకు చెప్పెయ్యి. నీఅభిప్రాయానికి మేముమాత్ర ము భిన్నంగా ప్రవర్తిస్తామా రేణుకా!"

"మీరు కష్టపడి తీసుకొచ్చిన సంబంధాల నన్నింటినీ నామనసు కు నచ్చలేదంటూ వుంటే బావ ఏమయినా అనుకుంటాడేమో!"

"బాగుంది అదేమన్న మాటా?"

"ఆభయంవల్లనే, ఈతన్నుకూడా నచ్చలేదని చెప్పడానికి సందే హిస్తున్నా నక్కయ్యా!"

"పోనీలేరేణుకా! నచ్చకపోతే యిప్పుడొచ్చిన ప్రమాదమేమీలేదు'

"ఈవచ్చిన యిద్దరువరులూకూడా ఎందువల్లనో నామనసును ఆకర్షించలేక పోయినారు. వారిలో లోటుండంగాదు నేనుచెప్పేది. వారి ముఖాలను చూడగానే నాకోవిధమయిన ఏవగింపుభావం జనించేది గాని, ప్రేమభావం ఉదయించలేదే. ఇందుకు కారణమేమిటో నేను చెప్పలేను. ఈ విషయాన్ని చెప్పడానికి నేను సిగ్గుపడుతున్నాను.

"నీఅభిప్రాయం నాకు తెలిసిందిరేణుకా! ఈవిషయం చెప్పడా నికి సిగ్గుపడితేఎల్లాగు? నీకిష్టంలేనిభర్తను కట్టిపెట్టి, నీనూరేళ్ళ బ్రతుకును దుఃఖభాజనం చెయ్యడానికి మాకుమాత్రమిష్టమా ?"

"మనసులోని విషయాన్ని దాచుకోలేక నీదగ్గర అనేశాను. అర విందా! ఈమాటలే మళ్ళీ బావదగ్గర చెప్పమంటే చెప్పలేను."

'అక్కర్లేదు. నేను వారితో చెప్పి మరోసంబంధం చూడమంటా.

"ఇప్పుడాపనికి తొందరలేదులే అక్కా! నువ్వు ముందు తలనీళ్ళు పోసుకుని బయటపడ్డ అనంతరం స్థిమితంమీద చూడొచ్చులెద్దు!"

"నేను పురుడుపోసుకొని, పదిమందిలోనూపడి, తిరిగి బ్రతుకు తానన్న నమ్మకం నీకుందా రేణుకా!"

"ఛా! అవేంమాట లక్కయ్యా! గర్భిణీసమయంలో నీకంటే ఎక్కువ బాధపడ్డవాళ్ళు-పురుట్లో అధికయాతన ననుభవించినవారూ అనేకమందిఉన్నారు. వారావిధంగా అప్పుడు సుఖప్రసవమవడమేగాకుండదరి మిలాను ఇంకాఅనేకమంది కొడుకులను, కూతుళ్ళనుకని, సుఖంగావున్నారు

"నాకా నమ్మకంలేదు రేణుకా!"

"అటువంటిమాట లనకక్కయ్యా! నేవినలేను. నువ్వీ ఒక్కపురుషుడుతో నేగాకుండ ఇంకా పదిమందికొడుకులు కూతుళ్ళకని సుఖంగుంటావు

"ఆయోగిదగ్గరకు వెళ్ళివచ్చినప్పటినుంచీ, నాకాధైర్యంలేదు. అతనివల్లను నాకేమీ లాభంలేకపోయింది సరిగదా! నారోగంకూడ ఎక్కువవుతూంది. అతనేకమందికి కుదిర్చాడు. అతనికి చాలామహిమవుంది. అటువంటి గొప్పవాడే నాకేమీ చెయ్యలేనప్పుడు నాకింకేంఆశవుంటుంది.

'ఆ! అతను మాత్రం భగవంతుడా ఏమిటి ఏదోఇస్తాడు తగ్గినవాళ్ళకు తగ్గుతుంది. లేనివాళ్ళకులేదు. అంతమాత్రంచేత అధైర్యపడవద్దు.

"నువ్వెన్నిచెప్పినా, నాకు బ్రతుకుతానన్న ఆశ చాలాతక్కువగావుంది ఒకవేళ నాప్రాణం ఇట్లట్లయితే నువ్వు మీతాతగారిదగ్గరకువెళ్ళిపోతావుగాబోలు. నన్ను తీసుకొచ్చినందుకు నేనేమీ చెయ్యలేకపోయాను

"నీకు మతిపోయినట్లుంది' శుభంపల్లే ఈపాడుమాట లేమిటీ"

"నాకెందుకో అంత అధైర్యంగా వుంది రేణుకా!"

"నీకంత భయంగావుంటే, ఇంకో వారంరోజులకు పురుడు వస్తుం

దనగానే దొరసాని హాస్పటలులోకి వెళ్ళివుందాములే అరవిందా!"

"నువ్వుకూడా వస్తావామరి?"

"సరి. నేనురాకుండా ఎక్కడకు వెడతాను అరవిందా? అహర్నిశములు నిన్నే కనిపెట్టుకొని వుంటాను. ఈపురిటిసమయంలో నిన్నువిడిచిపెట్టివుంటే నాప్రాణాలుమాత్రం నిలుస్తాయా అరవిందా?"

"నేనంటే నీకంతటి వాత్సల్యమూ వుందని నేనెరుగుదును."

'నీకొచ్చిన భయమేమీ లేదు. అనవసర మయిన భయమంతా పెట్టుకొని మనసును పాడుచేసుకోకక్కర్యా! ప్రతిరోజూ కొన్నివందల మంది సుఖప్రసవమై బిడ్డలను కంటూవుండడమును మనం చూడడంలేదూ? నీకిదే తొలిచూలుకావడంవల్ల ఇలా బెంగగావుంటుంది కొంచెం.?

'నువ్వనేకవిధాల ధైర్యం చెబుతున్నావు కాని, నాగుండెల్లో ఎప్పుడూ ఏదో అదటుగానే వుంటుంది రేణుకా!'

అని అరవిందా రేణుక లిద్దరూ పడకగదిలో ఒకే మంచంమీద పడుకొని మాట్లాడుకొంటూ వుండగ, అక్కడకు బెంగ్జీ వచ్చాడు. రేణుక వెంటనే అరవింద పక్కలోనుంచి లేచి, కొంచందూరంలో నిలుచుంది.

బెన—అప్పచెల్లెళ్ళిద్దరూ ఏదో రహస్యాలోచనచేస్తున్నారల్లేవుందే.

అర—మీగోల మీది రహస్యాలూలేవు-ఆలోచనా లేదు. ఈ పురుడను ఎలా వెళుతుందో నేను తిరిగి ప్రజల్లో పడతానా పడనా అని బెంగపెట్టుకొని పోయివున్నాను.

బెన— అంత బెంగయెందుకూ?

అర— నాశరీరస్థితి మీకేం తెలుస్తుంది?

బెన—ఎలావుందేమిటి?

అర— ఎలా వుందనిచెప్పనూ? ఈగండం గడిస్తే అంతేచాలు.

రేణు—ఇంకో పదిహేనురోజులకు పురుడువస్తుందిబావా! ఎందుకయినా మంచిది. ఇప్పటినుంచీ దొరసాని ఆస్పత్రిలో చేర్పిస్తే మంచిది. ఈలోగాగా వారు సుఖప్రసవము కావడానికి మందులు ఇస్తువుంటారు.

బెన—ఆస్పత్రిలో చేరడ మెందుకూ? దొరసాని మనయింటికే వ
చ్చేగా నేను కబురుపంపితే.

అర—అల్లాగ్గాదు. మన కక్కడవుంటేనే ఎక్కువ సదుపాయం. యెన్ని మాట్లని వస్తుంది దొరసాని.

బెన—ఎన్నిమాట్లయినా వస్తుంది. తగినంత డబ్బుయిస్తాము ఏం?

రేణు-అదిగాదు. మనం హాస్పటలులో నేవుంటే క్షణక్షణానికీవచ్చి చూస్తుంటారు. అక్కడ ఒక్కదొరసానేగాకుండా ఇంకాచాలామంది డాక్టర్లుంటారు. అందువల్ల మనం హాస్పటలులోనే వుండడం మంచిది.

అర—భోజనాలు?

బెన—వంటలక్కనుండి హాస్పటలుకు తీసుకొస్తుంటుంది. లేకపోతే అక్కడనే మరో రెండుగదులను ప్రత్యేకంగా తీసుకొన్నామూ అంటే వంటకూడా అక్కడనే చేయించుకోవచ్చు.

అర—ఇదిబాగుంది.

రేణు—మిగతా వ్యవహారాలన్నింటినీ ఎల్లాగునయినా సరిపెట్టుకోవచ్చును. కాని ఈవేళే హాస్పటలుకువెళ్ళి అవసరమయిన ఏర్పాటుల నన్నింటినీ చేయించుబావా! రేపే వెళ్ళిపోదాం.

బెన-సరే. ఇక్కడికీవ్యవహార మైంది. ఇక నీపెళ్ళి వ్యవహారమేమిటి?

రేణుక మాట్లాడకుండా తలవొంచుకొని నిలుచుంది.

బెన—అతను వచ్చి వెళ్ళాడుగదా! అతనికేమని చెప్పనుమరి.

అర—రేణుకకు అతన్ని పెళ్ళిచేసుకోవాలని లేద డీ? నచ్చలేదంటుండి మరో మంచిసంబంధం చూడండి త్వరగాను.

రేణు—దానికయినా యిప్పుడొచ్చిన తొందరేమీలేదు అక్కయ్యకు పురు వెళ్ళేవరకూ ఈవూసులేమీ ఆడవద్దుబావా!

అర—అలాగే లేవమ్మా! పురుడు వెళ్ళేకమాటేయిది.

బెన—అలాగేచూదాము స్థిమితంగా నేనెరిగివున్న స్నేహితులింకా చాలామందివున్నారు. వివాహాలు కావలసినవారుఒకేసారి పదిమందికీ

ఉత్తరాలు రాస్తాను. అందులో నచ్చిన వరుణ్ని ఏరుకోవచ్చు. సరా

అర—మా రేణుకకు స్వయంవరమన్న మాట?

రేణు-పో అక్కా! నువ్వుకూడా అస్తమానూ వేళాకోళమే.

అర—నీకు పెళ్ళిచేసి ముచ్చటగా చూడాలని మాకుచాలా సర దాగా వుందమ్మా? అందువల్ల మధ్యమధ్య నోటితో అనుకొని అయినా కొంత తృప్తి పడుతూ వుంటాము.

బెన—అంత ముచ్చటగా వుందిగాబట్టే, అంతకంతకు వెనక్కు వెడుతూంది రేణుక పెళ్ళి.

రేణు—పోనీలే వెడితే వెళ్ళింది. నన్నాకూపించ నక్కరలేదు. ఇప్పుడు నాపెళ్ళికొచ్చిన తొందరయేమీలేదు.

అర-ఉండవమ్మా. రేణుకా? బావగారుగాబట్టి వేళాకోళ మాడు తున్నారు. లేకపోతే ఇంకెవరు పరాసిక మాడతారు రేణుకా?

రేణు—అకమను నేనొద్దన్నానా యేమిటి? వేళాకోళ మాడడా నికి బావకు ఈపెళ్ళిగొడవతప్ప యింకేమీ కనుపించలేదుగాబోలు.

అర—అదా నువ్వనేది? అవునండీ! ఇంకో వేళాకోళమేదయినా ఆడరాదూ ఈపెళ్లి వూసు మానేసి?

బెన—ఇప్పుడు చెప్పారుగా! ఇకముందునుంచలాగే చేస్తానగా,

రేణు—సరే యింక హాస్పటలుకువెళ్ళి ముందుగా అక్కడ జర గవలసిన ఏర్పాటుల నన్నింటినీ చెయ్యండి. నేపోవెళ్లాలి అని రేణుక అన గానే బెనర్జి ఇంకేమీ మాట్లాడకుండా, హాస్పటలుకు వెళ్ళడానికి తనకో సం వీధిలో సిద్ధంగావున్న కారులో యెక్కి వెళ్ళాడు

———

౬

హాస్పటలులోవున్న నలుగురు దొరసాన్లు అరవింద గదిలోనేవున్నా రు మగడాక్టర్లిందరూ బయట వరండాలో పచార్లుచేస్తూవున్నారు. బెన ర్జి తనస్నేహితులతో డాక్టర్లతో అరవింద స్థితినిగురించి మాట్లాడు

తున్నాడు. ఆపరిస్థితిలో అక్కడున్న వారెవరి ముఖాలూకూడా కళకాంతులులేవు. రేణుక అరవింద మంచందగ్గర కూర్చుని, ఆమె ప్రసవ వేదన పడుతూంటే, తానది చూడలేక ఆమెకంటే యెక్కువగా బాధపడుతూంది. హృదయంలో ముఖాన ఆవరించిన చెమట బిందువుల నయినా తుడుచుకోకుండా రేణుక అరవిందకు దొరసాని ఆజ్ఞ ననుసరించి, విసినికర్రతో విసురుతూంది. అరవింద వొంటిమీాద స్పృహలేదు. అప్పుడు బయట పెద్దడాక్టరుతో బెనర్జీ మాట్లాడుతుండడమును రేణుక విన్నది.

బెన—ప్రమాదమేమీా లేదుగదా డాక్టరుగారూ!

డాక్ట—ఆమాట చెప్పటం చాలాకష్టం.

బెన—తల్లిప్రాణానికేమయినా అపాయం వస్తుందంటారా?

డాక్ట—వస్తే తల్లిప్రాణానికేగాని బిడ్డప్రాణానికేమీా ప్రమాదంరాదు.

బెన—ఈవేళ శిశోదయ మవుతుందంటారా?

డాక్ట—ఇంకోగంట-రెండుగంటల కాలంలో ప్రసవం కావాలి. ఈఅమ్మాయి భగవదనుగ్రహంవల్ల ఇప్పటికి బయట పడ్డప్పటికీ తరువాతనయినా, ఈకాన్పువల్ల ఈమెప్రాణానికపాయంముంది.

బెన—అయితే, ఆమెమీాద నేనింక ఆశ వదులుకో వలసినదేనా!

డాక్ట—ఇప్పుడటువంటిమాటలన్నీ యెందుకు బెనర్జీగారూ! ప్రస్తుతం ఈగండం గడచిపోనీయండి. తరువాతైనా మీారీఅమ్మాయిని హాస్పటలులోనుంచి యింటికితీసికెళ్ళిపోకండి. ఇక్కడనేవుంచి, వైద్యం నడిపిద్దాం.

బెన—చిత్తం—తమ శెలవెలాఐతే అలాగే చేస్తాను. మీాదేభారం.

వాళ్ళమాటలన్నిటినీ రేణుకస్పష్టంగావింది. అంతకుముందు అరవింద అన్నమాటలు—ఇప్పుడీడాక్టరంటున్నమాటలూ ఆమెహృదయాన్ని కలచివైచినై. ఆమెగుండెల్లో ఏదోపెద్దరాయిపడ్డట్టుగా అయింది అరవిందయొక్క అప్పటిముఖలక్షణాలను చూసినకొద్దీ రేణుకకు దుఃఖంఎక్కువ కావడం మొదలుపెట్టింది. అప్పుడామె కళ్ళనుంచి అప్రయత్నంగా కన్నీరు కాల్వలై పారడం మొదలుపట్టింది. ఈసమాచారాన్ని తెలుసుకొన్న

దొరసాని ఊరుకోమని సౌజ్ఞ చేయడంవల్ల రేణుక ఆదుఃఖాన్ని లోలోపలనే దిగమింగింది. నాఆదినుంచీ అతివాత్సల్యంతో సోదరికంటే ఎక్కువగా చూసుకొంటున్న అరవింద కెలవుంటుందోఅని రేణుక మితిలేనిదుఃఖము ననుభవించింది. నిమిష నిమిషానికీ ఆమె అరవింద ముఖలక్షణాలను పరీక్షిస్తూ, ఆమెసుఖప్రసవమై బయటపడిందీఅంటే, భగవంతుడికి మొక్కులు చెల్లిస్తాననీ-అమ్మవార్లకు జాతర్లుచేయిస్తాననీ-తిరుపతికొండ కెక్కుతాననీ సత్యనారాయణ వ్రతంచేస్తాననీ, అనేకవిధాలుగా మొక్కుకుంటూంది. ఇంతలో బయటి వరండాలోవున్న బెనర్జీ రేణుకను పిలవడంవల్ల ఆమెఅక్కడకు వెళ్ళింది. అరవిందయొక్కస్థితిని అతడామె నడుగుతున్నాడుఆమె అతనడిగినదానికి సమాధానం చెబుతూంది.

'టైమునోటుచేయండి. మగపిల్లవాడు' అని లోపలనుంచి ఏ లేడీడాక్టరో అనడంవల్ల, అందరూ ఒకక్షణంపాటు నిశ్శబ్దంగా వూరుకొని ప్రార్థించుకొన్నారు. రేణుక రెండడుగులలో గదిలోకివెళ్ళింది. అరవింద కళ్ళువిప్పచూసింది. 'రేణుకా! రేణుకా!' అని పిలిచింది.

"ఇక్కడ-ఇక్కడనే వున్నానక్కయ్యా! నీకేమీ భయంలేదు." అని అంటూ రేణుకవెళ్ళి అరవిందచేయిని పట్టుకొంది లేడీడాక్టర్లు-మంత్రసానులు-వాళ్ళు చేయవలసిన పనులను వారుపూర్తిచేశారు.

'మీబావఎక్కడ?' అని అరవింద రేణుకచెయ్యిపట్టుకొని అడిగింది

'బయట వరండాలోవున్నారు. పిలవమన్నావా?' అని రేణుక అడగ్గా

'ఇక మగవాళ్ళు లోపలకురావచ్చును' అని లేడీడాక్టరు చెప్పడంతోనే, అరవింద తన్నుగురించి అడుగుతున్నమాటను వినిన బెనర్జీ రెండడుగులలో గదిలోనివెళ్ళి—

'ఇక్కడనేవున్నాను అరవిందా! నీకొచ్చిన భయమేమీలేదు.' అని అంటూ ఆమెమంచానికి చేరువలోనిలుచుని, ఆమెపక్కలో 'కేరు—కేరు' మని యేడుస్తూ పడుకొనివున్న తనసతి బింబంవయిపుచూసి ఆనందబాష్పాలు రాల్చాడు.

'నేను బ్రతుకుతానంటండీ? రేణుకా! నన్ను విడిచిపెట్టకుండా వున్నావా?' అని అంటుండగానే అరవిందకు కళ్ళంటనీళ్ళు జలాజలా రాలి, పక్కలోని శిశువును తడిపాయి

'తప్పు అక్కయ్యా! అలా ఏడవగూడదు. ఇప్పుడు నీకొచ్చిన ప్రమాదమేమీ లేదు. ఇంతమంది డాక్టర్లున్నారు—బావఉన్నారు—నేనూ యిక్కడ నీదగ్గర నేవున్నాను. అలాకళ్ళంట నీళ్ళుపెట్టుకో కూడదు. నీబిడ్డను నొక్కసారి కళ్ళువిప్పి చూసుకో—' అని అంటూ రేణుక, అరవింద కళ్ళంట కారుతున్న నీళ్ళనుతుడిచి తనచేతులతో బిడ్డనదిమిపట్టుకొని కళ్లారా ఒక్కసారి చూసుకుంది.

'నాబిడ్డనాకు దక్కుతుందా? నేనాబిడ్డకు దక్కుతానా? చెప్పు, రేణుకా! నువ్వుచెప్పు-' అని అరవిందానికి తిరిగి ఆమెకళ్ళల్లోనీళ్ళు తిరిగాయి.

'ఇప్పుడు నువ్వటువంటి మాటలేవీ అనకూడదు అరవిందా! యిప్పుడు నీకింకేమీ భయంలేదు. ప్రమాదావస్థ దాటిపోయింది.' అని రేణుక అరవిందకు ధైర్యం చెప్పిందిపాపం.

ఇప్పుడు నీవంట్లో ఎలావుంది అరవిందా! అలా అధైర్యపడుతున్నావెందుకూ? అని బెనర్జీ అడుగుతే అరవింద అతనితో ఏమో చెప్పాలనుకొంది కాని ఆమె కంతటి ఓపికలేకపోయింది.

'ఇంక అందరూ బయటకు వెళ్ళిపోండి ఒకగంటసేపయినా ఆమె విశ్రాంతి తీసుకోవాలి-' అని దొరసాని ఇంగ్లీషులో అనడంవల్ల అందరూ ఆగది విడిచిపెట్టి బయట వరండాలోకి వెళ్ళిపోతుంటే రేణుకకూడా అక్కడనుంచి వెళ్ళిపోబోతుండగా, అరవింద ఆమెచేతిని విడిచిందికాదు.

'నువ్వొక్కర్తానవుమాత్రం రోగిని మాట్లాడించకుండా ఇక్కడఉండు. అని లేడీడాక్టరు రేణుక అక్కడను ఉండడానికి అంగీకరించడంవల్ల రేణుకకూ, అరవిందకూ ఎక్కడలేని సంతోషమూవచ్చింది.

'రేణుకా!' అని అరవింద ఏమిటో చెప్పబోతుంది.

'మాట్లాడకక్కయ్యా కళ్ళుమూసుకొని పడుకో! లేకపోతేడాక్టరమ్మ

కోప్పడుతుంది. ఇప్పుడు నీకు విశ్రాంతి అవసరమట'

“ ఒక్క మాట! ” అని అరవిందఅన్నది.

‘ ఒద్దు-ఇప్పుడేమీ మాట్లాడవద్దు నువ్వు మాట్లాడావంటే నేను కూడా బయటకు వెళ్ళిపోవలసి వస్తుంది! అని రేణుక అనడంవల్ల అరవింద ఇంకేమీ మాట్లాడలేదు. కళ్ళుమూసుకొని పడుకొంది.

అప్పుడు రేణుక అరవిందకు విసినకర్రతో విసురుతూ తనలోఆలోచించుకోవడం మొదలుపెట్టింది. ‘పాపమీమె కెలాఫుంటుందో యేమిటో పెద్దడాక్టరు బావతో చెప్పినమాటలు విన్నప్పటినుంచీ నాకడుపులో వెయ్యి కొరకంచులు దహించుకొని పోతూన్నట్లుగావుంది నాకు తలిదండ్రులు లేనిలోటూ-తోబుట్టినవాళ్ళు లేనిలోటూ కనుపించకుండా ఈమె అందరికంటేకూడా యెక్కువగా వెయ్యికళ్ళతో కనిపెట్టి చూస్తున్నదినన్ను. ఈమెయొక్క పవిత్రవాత్సల్యం చూసుకొనేగదా, నేను చిన్నప్పటినుంచీ కంటికి రెప్పలాగున కాచి, పెంచిన తాతయ్యనుకూడా కాదని అతనితో చెప్పనయినా చెప్పకుండా అరవింద రమ్మనడమే తడవుగా ఈమెతోవచ్చేశాను? నేను గోరంత పనిచేస్తే ఆమె ఓర్చుకోలేకపోయేది. మొక్కలకు నీళ్లుపోసినంత మాత్రానికే. నేనలసిపోతానని బెంగపెట్టుకొనిపోయేది. ముందు నేను తింటేనేగాని తాను తినేదిగాదు ముందుబట్టువాది—ముందు తిండినాది. ఆమెకు నేనంటే యింత ప్రేమ యెందుకో? అరవింద నన్నింత అధిక వాత్సల్యంతో చూస్తుండడమును కనిపెట్టిన బావ తనలో యేమనుకొంటున్నాడో యేమోగాని పయికిమాత్రం అతనుకూడా నన్ను ప్రేమగానే చూస్తున్నాడు. అతనలా చూడ్డానికి అరవింద వాత్సల్యమేకదా కారణం? తానయినా కొనుక్కోకుండా, సరదాగా అపురూపంగావస్తూన్న అగళ్లచీరను ముందుగా, నాకేకొంది మూడువందల రూపాయలూపోసి, ఇటువంటిగాఢమయిన ప్రేమ కన్నతండ్రికీ, తల్లికీ అయినా వుంటుందని నేనుఅనుకోను ఈమె పవిత్ర వాత్సల్యం నన్ను సర్వ దుఃఖాలనూ మరిపించింది. అన్నికష్టాలూ మాయంచేసింది.

అయిదారువేలు ఖర్చుపెట్టి నాకు పెళ్ళిచేయడాని కూడా నిశ్చయం చేసింది. భర్తకేమని చెప్పిందో యేమిటో—ఆమె చెప్పినట్లుగానే అతనుకూడా చేయడానికి సమ్మతించడ మొకచిత్రం. నేనామెకు కడుపునబుట్టిన తోబుట్టువునుగాను-ఆప్తబంధువురాలను గాను-రక్తసంబంధమున్నదానినయినాగాదు. కేవలం ఒక స్నేహితురాల్ని. చిన్నప్పుడు చదువుకొన్న సహాధ్యాయని. నేనింకా యెంతమందితో కలసి చదువుకొనలేదూ! వారందరూ ఇప్పుడేరీ? కంటికయినా అగుపిస్తున్నారా? ఎవరకూలేని బలవత్తరసంబంధాన్ని ఆభగవంతుడు అరవిందకూ నాకూ ఎందుకు కలిగించాడో ఎవరు చెప్పగలరూ? బిడ్డ తల్లిపక్కలో పడుకొని ఎంతనిశ్చలంగా నిద్రపోతున్నాడో! మూడుమూర్తులా తల్లిపోలికలనుకనే ముద్దులు మూటకడుతున్నాడు. బిడ్డమీద చేతులువేసి హృదయానికి హత్తుకొని అరవిందకళ్ళు మూసుకొంది. నిద్రపట్టిందల్లేవుంది. మాతృప్రేమ నిద్రలోనయినా బిడ్డను మరువదుగదా!' అని రేణుక చాలాసేపటివరకూ తనలో ఆలోచించుకొంటూ అరవిందవయిపు ఆమెబిడ్డవయిపూ చూసి నిద్రలోవున్న వారిద్దరకూ ఉపచారాలు చేస్తూంది. మరికొంతసేపటికి అరవింద కళ్ళువిప్పిచూసి, దాహమన్నట్లుగా నోరుతెరచింది. వెంటనే రేణుక డాక్టరు చెప్పినవిధంగా అక్కడిబల్లమీదవున్న ద్రాక్షపండ్లరసమును ఆమెగొంతుకలో పోసింది. అరవింద పదిగుటకలవరకూ మింగి యికచాలు నన్నట్లుగా తలవూపింది. రేణుక తిరిగి ద్రాక్షపండ్లగ్లాసును బల్లమీదపెట్టి మంచందగ్గర కొచ్చి-ఏంఅక్కా నిద్రపట్టిందా? ఇప్పుడెలావుంది? అని అడిగింది.

అరవింద ఒకసారి బిడ్డనొకసారి చూసుకొని 'రేణుకా! ఇప్పుడునాకు చాలా ఖులాసాగానే వుంది. ఇందాకటినుంచీ నువ్విక్కడనేవున్నావా?'

'ఇక్కడనే వున్నానక్కా!' అని రేణుక జబాబుచెప్పింది.

'అయ్యో! భోజనమయినా చెయ్యకుండా అప్పటినుంచీ యిక్కడనే యెందుకు కూర్చున్నావు రేణుకా!'

'నాభోజనానికిప్పుడేమీ తొందరలే! ప్రొద్దుటకాఫీ త్రాగానుతే.

'మీబావయెక్కడ?'

'భోజనంచేసి-ఒకసారి స్టుడియోకి వెళ్ళివస్తానని చెప్పారునాతో వారొచ్చాక నేను భోజనానికి వెడతాను.'

'చాలా పొద్దుపోయినట్లుంది నువ్వువెళ్ళి ముందుగా భోజనంచేసి రా రేణుకా! ప్రొద్దుటనగా తాగినకాఫీ ఇంకా ఇప్పటిదాకా కూర్చుందా గడియారం మూడుకొట్టడం నేనిందాకనే మగతనిద్దరలో విన్నాను.'

'నాభోజనానికేమీ తొందరలేదక్కయ్యా!'

'మీబావ కొడుకును చూస్తున్నారా?'

'చూసుకొన్నారక్కా! దానికేంగాని, నువ్వింకా కళ్ళుమూసుకొని పడుకొంటేనే మంచిదేమో! ఇప్పుడు నీవంట్లో ఎలావుందక్కా!'

'నాకేం రేణుకా! ఇప్పుడు నాకెంతో కొత్తశక్తి వచ్చినట్లుగావుంది. మంచి ఉత్సాహంగావుంది నువ్వు పాపను ఎత్తుకొని ముద్దాడావా?"

'లేదేఅక్కా! ఎత్తుకోవడం చేతకాదు. నలిగిపోతాడేమో! ఇప్పుడు అప్పుడే యెత్తుకొంటానని వూరుకున్నాను.'

'భయంలేదమ్మా! ఎత్తుకొందువుగానీ-నిద్ర లేచాకకూడాను.' అని చెప్పి అరవింద రేణుకను మంచంమీద కూర్చోమనిచెప్పి, తనబిడ్డనామె ఒడిలో—పెట్టింది. రేణుక ఆబిడ్డనుముద్దాడి—

'అక్కా! అచ్చంగా నీపోలికేనే! ముద్దులుమూటకడుతున్నాడు పెద్దజుట్టు చారడేసి కళ్ళూను.'

'ఇప్పటినుంచీ ఈబిడ్డ నీదిగాని నాదిగాదు రేణుకా!'

'అవేంమాటలూ?'

'నేనెప్పుడయినా నీతో వేళాకోళ మాడానా రేణుకా!'

"లేదు.'

'రేణుకా! నేనిలా మాట్లాడుతున్నానని నువ్వేమీ అనుకోకు. నాకిప్పటిలో ఏమీ భయంలేదుకాని-ఎప్పుడయినా నాప్రాణాలుపోతే, అప్పుడు నువ్వే యీబిడ్డకు తల్లివై—కాపాడాలమ్మా!'

రేణుక కళ్ళంట నీళ్ళు జలజలా రాలి, ఒడిలోవున్న బిడ్డమీదపడ్డాయి బెనర్జీ [illegible] డాక్టరన్న మాటలామెగుండెల్లో మారుమోగాయి

'అలా ఏడుస్తావెందుకు రేణుకా! ఇప్పుడు నాకేమీ భయంలేదులే. ఎందుకయినా మంచిదని ఎప్పటిదో యిప్పుడు చెబుతున్నానంతే '

రేణుకకళ్ళంట నీరుకారుస్తూనే అరవిందముఖంలోకి చూసింది. ఆమెనటువంటి మాటలాడవద్దని చెప్పుదామనుకొంది కాని ఆమెకంఠం శోకరుద్ధమైపోవడంవల్ల మాటరాలేదు. బయట వరండాలో అంతకుముందు పెద్దడాక్టరు బెనర్జీతో అన్న మాటలామెకుతిరిగి జ్ఞాపకం వచ్చాయి.

'నీకింతవరకూ వివాహం కాకపోవడం చాలామంచిది రేణుకా!'

'అక్కా! అక్కా! అదేమిటి అలా మాట్లాడుతున్నావూ ముఖలక్షణాలుకూడా అలా మారిపోతున్నాయెందుకూ? ఇంతలోనే ముఖమంతా తెల్లబోయిందేమో అక్కా! అయ్యో! అయ్యో! కళ్ళుకూడా మూసేస్తున్నావెందుకూ? పెద్దడాక్టర్ని పిలుచుకొస్తాను. బిడ్డను తీసుకో—'

అని రేణుక లేవబోతూవుంటే, అరవింద ఆమెను చేతితో సౌంజ్ఞ చేసి వెళ్ళవద్దని చెప్పింది. రేణుకకు లేవడానికి కాళ్ళురాలేదు మాట్లాడడానికి నోరురాలేదు-సంతతధారాపాతంగా కారుతున్న ఆకళ్ళతోనే అరవిందముఖంలోకి పిచ్చిదానిలాగున చూస్తూ-ఒడిలోని బిడ్డ అలాగే కూర్చుండిపోయింది.

'రేణుకా! ఈబిడ్డను నీకడుపులో పెట్టుకో! ఈస్థితినీది-ఈసంసారమనీది బావనే పెళ్ళిచేసుకో' అని అంటూనే అరవింద కళ్ళుమూసింది. 'అక్కా! అక్కా!' అని రేణుక పెద్దపెట్టున ఏడవడం మొదలుపెట్టింది. ఆమె యేడుపువిని డాక్టర్లిద్దరూ పరుగెత్తుకొచ్చారు. అప్పుడే స్టుడియోనుంచివచ్చిన బెనర్జీ కారుదిగి వడివడిగా ఆమెనుచూశాడు ఏముందీ?

— —

౧౦

'' ఇంతఘోరం జరుగుతుందని మన మెప్పుడయినా అనుకోనయినా అనుకొన్నామా చెల్లెమ్మా? '

‘ అయ్యో! ఎంతపని జరిగిందన్నయ్యా. ఇరవై యేళ్ళయినా పూర్తిగాని అరవింద కప్పుడే నూరేళ్ళూ నిండాయి. ఆమాయకాను పాపిషకు రాకపోయినా తీరిపోను. ’

‘ అరవింద పోయిందని రేణుక రాసినప్పటినుంచీ నాకడుపున పుట్టిన బిడ్డపోయినంత దుఃఖంగావుంది చెల్లెమ్మా! భార్యయొక్క ఈ దుర్మరణానికి బెనర్జి ఎంతగా దుఃఖిస్తున్నాడో! తోబుట్టినదానికంటే తన్నెక్కువ వాత్సల్యంతో చూసుకొన్న స్నేహితురాలు పోయినందుకు మనరేణుక యెంతగా కుమిలిపోతూందో! ’

“ అదిరాసిన ఆఉత్తరంలోనే రేణుక తనదుఃఖాన్నంతటినీ గుమ్మరించేసింది చూడలేదన్నయ్యా? ’

‘ అవునవును. ప్రాణసమానురాలయిన స్నేహితురాల్ని పోగొట్టుకొన్న తానింక బ్రతకడమే అనవసరమని రాస్తూంది రేణుక. ’

‘ కొంపతీసి అరవిందపోయిన దుఃఖంవల్ల రేణుక ఏమయినా అఘాయిత్యం చేస్తుందేమో అన్నయ్యా! అందువల్ల మనం సాధ్యమయినంత త్వరలోనే దాన్ని చేరుకోవాలి.

‘ ఉత్తరం అందిన తక్షణం బయలుదేరి రావలసిందని రాసింది కూడాను. సమయానికి మనదగ్గర ఖర్చులకు సొమ్ముంటుందో ఉండదోఅని వందరూపాయలు రేణుకిచ్చి మనకుపంపేటట్లు చేశాడుట బెనర్జి—

‘ పాపం! అరవిందపోయిన కారణంవల్ల అయిద్దరూకూడా బేజారెత్తి పోతూవుంటారు. ’

‘ అరవింద పోయినాన్నాడే రేణుకఉత్తరాన్ని మనియార్డరూ పంపిందా?

‘ లేదు చెల్లెమ్మా! అరవిందపోయిన మర్నాడుపంపాను ఈ మనియార్డరూ, ఉత్తరమూ కూడాను. ”

“ అయితే అరవిందపోయి యిప్పటి కెన్నాళ్ళయినట్లు? ’

‘ ఇదిగో! ఏడోతారీఖున రేణుకరాసిన ఉత్తరంలో నిన్నటిదినమున అరవింద స్వర్గధామం చేరిందిఅనివుంది. ఉత్తరం రావడానికి మూడురోజు

లు పడుతుంది. ఈ పేప ర్లాలుగో తారీఖుఅంటే ఈవేళ అయిదో రోజు

'అబ్బా! ఇంతలో ఎంతములిగింది! క్షణానికి ఏదివస్తుందో ఎవరు చెప్పలేరుగదా!'

'అరవిందకు కలిగిన మగబిడ్డమాత్రం సురక్షితంగానే వున్నాడుట

'ఆబిడ్డ మాతృగండాన్ని పుట్టివుండాలి.'

'ఇక ఆబిడ్డనెవరు పెంచుతారు?'

'బెంగ్జి గొప్పశ్రీమంతుడుగదా, తిరిగి వివాహం చేసుకుంటాడు.'

'అవును మరిలేకపోతే ఆపసిబిడ్డ ఎలాపెరుగుతుంది? చెల్లెమ్మా!'

'అవునన్నయ్యా! బెంగ్జి తనకిష్టంలేకపోయినా బిడ్డకోసమయినా తిరిగి వివాహం చేసుకోక తప్పదు.'

'ఆతనయినా ముసలివాడా—ముక్కవాడా? పట్టుమనిచూస్తే ముప్ఫయి సంవత్సరాలకంటే అధిక ముండవాతనికి.'

'తల్లిలేని తనబిడ్డను మనకిస్తే పెంచడానికి నాకెటువంటి అభ్యంతరంలేదు.

'అయ్యో! నీకెంతవెర్రే సర్వశక్తులూ ధారపోసి, ఆ అరవిందకు మరణచిహ్నంగా పుట్టిన తనముద్దుబిడ్డను మనకెందుకిస్తాడు ఆబిడ్డ నతడు దాదుల చేతుల్లో ఘనంగా పెంచుకోగలడు.'

'అవును. అయితే మన ప్రయాణమెప్పుడన్నయ్యా?'

"మంచిరోజు చూసుకొని, రేపు గని, ఎల్లు డిగాని, బయలుదేరి వెడదాము చెల్లెమ్మా! మనమాలశ్యం చేయడానికి వల్లగాదు.'

'మన మక్కడ నాలు గయిదు రోజులుంటి రేణుకను మనతో తీసుకొచ్చెయ్యడమే గాదూ!" 'అంతే సరి.'

'పాప మరవింద తగిన వరుణ్ని తీసుకొచ్చి, రేణుకకు పెళ్ళిచేయాలని కూడా అనుకొంది. ఆమెస్నేహమెంతటి ఉదారమయినదో చూడన్నయ్యా

'సద్గుణవంతు లక్కటకాలం బ్రతుకరని చెప్పడానికి అరవిందే నిదర్శనం

"అవును. పాపిష్టి ప్రాణాలు కలకాలమూ నిలుస్తాయి."

'నాలుగు రోజులువుండి, భార్యావియోగంవల్ల దుఃఖముతో కుంగి

పోతున్న బెనర్జీకి ఊరట వాక్యాలు పలికి ధైర్యముగొలపాలి. ప్రాణన్నీ తుహిరాలు పోయిన విచారంవల్ల కుమిలిపోయే రేణుకను బుజ్జగించాలి.

'ఒకవేళ బెనర్జి రేణుక యందింకా వాత్సల్యము గలిగి-భార్యవుండగా ఆమెకు వివాహం జరిగించడం కుదరలేదు గాబట్టి ఈకార్యాన్ని తా చేసుకొని భార్యయొక్క కోరికను తీరుస్తాడేమో.'

'చేస్తే చెయ్యనూవచ్చును. అటువంటి ధనికుడు ఇదెంతపని' ఐదువేలు తనవికాదంటే రేణుకకు తగినవరుణ్ని పెళ్ళిచెయ్యగలడు.'

'అతనలాచేస్తే మనంకూడా కృతకృత్యుల మయినట్లే'

'కాదూ? ఇంతకాలమూ ప్రయత్నంచేసి, దానికిమనం పెళ్ళిచెయ్యలేకపోయినాము. ఈ పాడుముండారోజుల్లో ఎంత గోచీపాతరాయుడయినా వేలకువేలు పొయ్యమని గొంతుకకు అంగుడులేకుండా అడుగుతూంటే, ఆడబిడ్డలగన్న తలిదండ్రులెందరు తమకున్న ఇళ్లు వాకిళ్ళు నమ్ముకొని పంచలపాలవుతున్నారో యెవరుచెప్పగలరూ?'

"మనమందుకు సిద్ధపడనప్పటికీ రేణుకపెళ్ళి చేయలేకపోతున్నామే

'చివరకు నేను నాతల్లిపెళ్ళి చూడకుండానే చచ్చిపోతానేమో! ఈనేళ కనుపించినమనిషి రేపు అవుపడ్డంలేదు. ఏభైఏళ్ళుదాటిన ముండా వాణ్ని ఏక్షణంలో నోరుఆవలించి, ఈగుక్కెడుప్రాణాలు వదిలేస్తానో.'

'నువ్వుచెప్పిన విషయంకూడా ఆలోచించవలసిందే అన్నయ్యా' నూరేళ్ళుబ్రతికి భర్తతో అష్టఐశ్వర్యములూ అనుభవించవలసిన ఇరవైయేళ్ళ లేబ్రాయపుపడుచు దుమ్ములో కలిసిపోయింది. ముంచుకొస్తుందని ఎవరయినా ఎప్పుడయినా అనుకొన్నారా? ఇంతకుముందు నేనొచ్చినప్పుడు అరవిందనునేనుకూడా ఒకటిరెండుసార్లు చూచాను. పోతపోసిన బంగారపు విగ్రహంలా వుండేది పాపం!'

'చిన్నప్పటినుంచీ అనాధబాలికయై అక్కడా యిక్కడా యాచన చేసుకొంటూ చదువుకొని-అదికూడా సాగక అనంతరం ఓమిషనుకొట్లో రెక్కలకష్టంచేసుకొని బ్రతికేది. చివరకాకష్టాలన్నీ గడిచి ఓ శ్రీమంతుడ

యిన భర్తను వివాహమాడి, సుఖద్దామనేరోజులు వచ్చేటప్పటికా భగవంతుడు చూడలేక ఆమెను తనపాట్ట పెట్టుకొన్నాడు. అరవింద పోయిందన్న ఈఉత్తరం రేణుకదగ్గరనుంచి వచ్చినప్పటినుంచీ, గుండెలో గతుకుమన్నట్లుగా వుంటూంది చెల్లెమ్మా,'

'అలాగే ఆమె మన బంధుకోటిలోని మ షి గాకపోయినప్పటికీ అంతకంటే ఎక్కువ వాత్సల్యంతో మసులుతుండేది. ఆమె బ్రతికివుంటే మనకీ రేణుకకూ కూడా ఎటువంటిలోపమూ వచ్చివుండేదిగాదు.'

'ఇంతకూ మనం దురదృష్టవంతులం చెల్లెమ్మా! మనవంటి లేని సంసారానికి అరవిందవంటి లోపమూ వచ్చివుండేదిగాదు.'

'జరిగిపోయినదానిని గురించి మనమెంతగా విచారించినా ఏమీ ప్రయోజనంలేదు అన్నయ్యా! రేపునుంచిది మనం బయలుదేర్దాము. అని చెల్లెమ్మఅంటే అలాగే వెళ్లాలని నవీనచంద్రంచెప్పి ఆమర్నాడు కలకత్తా చెల్లెలితో వెళ్ళడానికి ఏర్పాటు చేశాడు.

---

౧౧

రేణుక బిడ్డనొడిలో కూర్చోబెట్టుకొని, ఒకకంట నీరుకారుస్తూ, చెంచాతో పాలుపడుతూ 'అయ్యో! అరవిందా! నిబిడ్డను నాకంతానికి చుట్టి వెళ్ళిపోయావా? నీకింతలోనే నూరేళ్ళు నిండిపోయినాయా! అయ్యో! అక్కా నీవియోగదుఃఖాన్ని భరించి నేనెలాగు బ్రతుకగలనే? అబ్బా! భగవంతు డెంతటి అన్యాయానికరుడై పోయినాడూ అయ్యయ్యో! నువ్వులేని ఈ యింట్లోనే నొక్కక్షణముండలేనే అక్కా! ఈబిడ్డనేంచెయ్యను? ఆవనిద్రాహారాలు విసర్జించి, అహర్నిశములు మంచంపట్టి నీకోసం దుఃఖిస్తుంటే నేను చూడలేకుండా వున్నానే' అని తనలో కుమిలికుమిలి ఏడుస్తున్న సమయంలో ఆమెదగ్గరకు బెహర్జీవచ్చి చేరువలో కూర్చున్నాడు.

ఈకొద్దిరోజుల్లోనే అతని రూపమంతా మారిపోయింది. అంతకుముందు గంటకొక సూటునుధరించే ఆశ్రీమంతుడు బ్రతుకుపయిననే విర

క్కిపోంది, మాసిన గడ్డంతోనూ, మలినంగావున్న దుస్తులతోనూ మొన్నటూ అన్నంముఖ మెరుగని వాడిలాగునా భయంకరంగా కనిపిస్తున్నాడు. అతనొకసారి రేణుకవయిపూ మరొకసారి ఆమె ఒడిలోని బిడ్డవయిపూ చూశాడు-పొంగి పొరలివచ్చే దుఃఖాన్ని అవుచేసుకొని లేనిఓపికను తెచ్చుకొని రేణుకా!—

"బావా?'

'నేడో రేపో మీతాతగా రొస్తారల్లే వుందిగదూ!'

'ఉత్తరంరాసి ఈవేళకు వారమయింది బావా!'

'రేణుకా! మీతాతయ్యవస్తే నువ్వు నన్నూ—కళ్లుతెరవని ఈపసికూనను మహాదుఃఖంలో ముంచి వెళ్ళిపోతావా?' రేణుక

'రేణుకకళ్ళంట నీరు గ్రక్కడం తప్ప యింకేమీ చెప్పలేకపోయింది.

'రేణుకా, మీ అక్కయ్యలాగునే నువ్వుకూడా నాయెడల ఇంతటి కాఠిన్యమునుబూని; భార్యా విరహితుడనై వున్న నన్నూ—తల్లిలేని ఈ గుడ్డునూ ఈఅంధకార కూపంలో దిగవిడచి వెళ్ళిపోతావా?'

రేణుక దీనంగా బావగ్ది ముఖంలోకి చూసిందిపాపం.

'అయ్యో! భగవంతుడు నన్నుకూడా తీసికొనిపోయి, నాహృదయానికి హృదయమై-ప్రాణానికి ప్రాణామైన నాఅరవిందను చేర్చరాదా?'

'బావా! అరవింద రక్తాన్ని పంచుకొని, ఆమెరూపంతోనే పుట్టిన ఈబిడ్డను చూచుకోవూ?' యిలావిచారించిన ఏంలాభముందీ.

'చూడలేను రేణుకా! నాకళ్ళీ దారుణ దుఃఖంలో గుడ్డివై పోయాయి ఈగుడ్డికన్నులతో చూసినా ఒకటే-చూడకపోయినా ఒకటే. నువ్వే దిక్కుమాలిన ఆబిడ్డకు మాతృదేవతవై ఒక్కసారి కరుణతో చూశావంటే—' అది బ్రతికిపోయింది.

'బావా!' అని. అతనికళ్ళల్లో చూసింది.

'రేణుకా! నే నున్మత్తుడనై యీమాటలను పలుకడంలేదు. నువ్వొకింత దయారసమును నాపై చిలకడంవల్ల ఇక బ్రతుకుపై ఆశవదలు

కొంచెం మోడువారిపోయివున్న నాజీవితం తిరిగి చిగర్చగలదు రేణుకా నీయొక్క సుద్దుపల్కులవల్ల చిలికి, శిథిలమైపోయివున్న నాహృదయం తిరిగిద్రవించగలదు. ఒడిలోవున్న ఆబిడ్డ మాతృభావతో నీముఖంలోకిఎలా చూస్తుందోచూడూ! చెప్పురేణుకా! చెప్పు బిడియపడడానికిది సమయంగాదు. రేపో నేడో మీతాతయ్య వచ్చేదూఅంటే ఇంక ఆలోచించడానికి సావకాశముండదు.

' అయ్యో! రేణుకా! నీకింత దయలేకపోయిందా! నామీద లేకపోయినందుకు నేనంతగా విచారించను. ఒడిలోని ఆదిక్కులేని పక్షివయి పొక్కసారిచూడు. నువ్వు తాతయ్యతో వెళ్లిపోతే—కళ్ళుతెరవని యీ కూన నెవరు పెంచగలరు. రేణుకా! దిక్కులేని యీకూన నెవరిచేతుల్లో పెట్టను? నూరేళ్ళు బ్రతకవలసిన ఈప్రాణాన్ని ఎవరికి వప్పగించనూ!'

రేణుకా! అరవిందను నువ్వెంతగాప్రేమించేదానవూ? మీయిద్దర శరీరాలూ వేరయినా, ఆత్మలురెండూ ఒకటేగదా! ఆవిషయం లోకమందరూ ఎరుగరా? అరవిందపై వుండే నీప త్రప్రేమ ఈపసిగుడ్డువెపుమరల్చు ఈబిడ్డ నీపాలిగానికి ప్రాణమయిన అరవిందగర్భాన్ని చీల్చుకొనిపుట్టాడన్న విషయాన్ని మరచిపోకు. లేదా! అరవిందమీద నీకు ప్రేమలేకపోతేచెప్పు నిన్ను నేనింక మాట్లాడించను. నాబిడ్డతో నేనేదో అయిపోతాను.

' ఎంతమాటన్నావూ బావా! ఇప్పటికీ ఎప్పటికి అరవింద నాప్రాణంలోనిప్రాణం—నాహృదయంలోని హృదయం—జీవములోని జీవం.'

' ఆవిషయమును గుర్తించడంవల్లనే. నేనింతగానీకు చెబుతున్నాను. రేణుకా! నామాటవినవూ! సంతతదుఃఖదావానలంలో దగ్ధమైపోతున్న నాహృదయానికి ఒకచల్లనిమాటతో ఉపశాంతిని చేకూర్చవూ."

రేణుక తిరిగి కౌనగ్గిముఖంలో బిడ్డముఖంలోకి ఒకసారిచూసింది.

నువ్వీపనిని చేయడంవల్ల స్వర్గధామంలోని అరవింద హృదయానికి శాంతి—దేవతల కాహ్లాదకరము రేణుకా! ఏది ఆచల్లనిమాట!

రేణుక— ఏమీమాట్లాడలేక పోయింది.

' ఈబిడ్డనీది— ఈసంసారం నీది—'

అని మరణశయ్యపై నున్న అరవింద చెప్పినమాటలు రేణుక హృదయంలో సహస్రగంటానాదములై మోగాయి.

'బావా! ఆవిషయంనాకు తెలునును' అని రేణుక అనలేక అంది.

'నీకు తెలునును రేణుకా! నీకు తెలియని విషయమేమీ ప్రపంచంలో యింకేదీలేదు. నువ్వునాహృదయతాపాన్ని గుర్తించగలవు-దిక్కులేని బిడ్డ యొక్క దుస్థితిని గమనించగలవు. ఇక కావలసింది. అదీ ఒక్కటే'

'హృదయపూర్వకమయిన నీఅంగీకారం!'

'ఈదిక్కుమాలిన పక్షికి మాతృదేవతవు కావడానికి.'

'బావా! అది మరణశయ్యపై నున్న అరవింద అజ్ఞకూడాను. ఆమె యొక్క ప్రాణవాయువు అనంతవాయువులో కలసిపోయేముందు ఆమెబిడ్డను నాఒడిలో కూర్చుండబెట్టి-'రేణుకా! ఈబిడ్డనీది ఈసంసారంనీది' అన్న మాటలను నేనేజన్మములోనూ కూడా మరచిపోలేదు.

'ఆబుద్ధిమంతురాలు తనబిడ్డకు తన సంసారానికీ అవసరమయిన యేర్పాటు చేసుకొనే వెళ్ళిపోయిందన్న మాట?'

'స్వర్గధామంలోవున్న అక్కయ్యఆజ్ఞకు నేనెదురాడలేను బావా కాని

'ప్రాణసమానురాలయిన స్నేహితురాలు గతిస్తే రేణుక ఆమెభర్తను తనభర్తగా స్వీకరించి-సర్వసౌఖ్యాలనూ అనుభవిస్తూ-ఏ-అపనింద ఆడిపోసుకోదా బావా?' 'అయ్యో! ఈపాడుసంఘానికి నువ్వింకా లెక్కచేస్తావా ఒకరి దుఃఖాలనూ-ఒకరికష్టాలనూ గమనించకుండా పాషాణహృదయమై స్వార్థపరత్వంతో ప్రవర్తించే ఈగుడ్డిసంఘాన్ని నువ్వెందుకు లెక్కచేస్తావు దిక్కుమాలిన ఈబిడ్డక్షేమం చూడు- స్వర్గస్థురాలయిన అరవింద యొక్క ఆత్మశాంతికై ఆప్రయత్నం చెయ్యి-అనంతదుఃఖ తాపాలంచేత క్రమేణా దుమారిపోతున్న నాదుఃఖమయ జీవితంలోకి ఒక్కసారి తొంగిచూడు!'

'బావా! ఇకనీమాట కెదురులేదు స్వర్గధామంలోవున్న అక్కయ్యఆజ్ఞకు తిరుగులేదు. నానిండు హృదయంతోపాటు శరీరాన్ని అక్కయ్యపేరు మీదుగా, ఆమె ఆజ్ఞ ప్రకారం నీపాదాలకు అంకితం చేస్తున్నా నీనాడు.

'రేణుకా! ఇప్పటికి నాహృదయతాపం తీరింది. అరవింద ఆత్మకుశాంతి

చేకూరింది- ఇదికష్టంలోని సుఖం. అని అంటూ బెనర్జి ఒడిలోనిబిడ్డ సహితంగా రేణుకను హృదయానికి హత్తుకొన్నాడు. క్షణమాత్రకాలం ఆమూడు ప్రాణాలూ నిర్మల శాంతిని పొందాయి అరవింద కొడుక్కు సంవత్సర ప్రాయము వచ్చింది. తప్పటడుగు వేస్తున్నాడు. బెనర్జి, రేణుక లిద్దరూ ఆ పాపను 'అరవిందం' అని పిలుస్తున్నారు అరవిందాన్ని ఒడిలోనిపెట్టుకొని, స్వర్గధామంలోనిఅరవిందసాక్షిగా, భగవత్సాన్నిధ్యాన్ని, 'మేమిద్దరమూ భార్యాభర్తలమై అరవిందఆజ్ఞను పాటిస్తాము.' అని చేసుకొన్న ప్రమాణ వాక్యాన్ని అరవిందా, బెనర్జీలిద్దరూ నడుపుతున్నారు వారిఆశయానికి ఇత ర్యాగాని, చెల్లాయమ్మగాని ఎటువంటి అభ్యంతరాన్నీ చెప్పకపోగా వారి దాంపత్యాన్నీ కనులపండువుగా తిలకిస్తూ, సంఘముతో నిమిత్తమూ లేకుండా మసులుకొంటున్నారు స్టుడియోలోని ఒకఉద్యానవనంలో అరవింద యొక్క మరణానికిగుర్తు ఆమెయొక్క ఫోటోననుసరించి, పాలరాతితో ఒక శిలావిగ్రహం చెక్కబడింది. ప్రతిఆదివారం పెట్టుకొన్న నియమం ప్రకారం అరవిందయొక్క శిలాప్రతిమ దగ్గరకొచ్చారు గళ్ళచీర ముస్తాయిలోనున్న రేణుకను బిగియారకౌగలించుకొని అరవింద ఒకప్పుడు ముద్దాడింది. కాబట్టి ఆమెకు ప్రియమయిన ఆగళ్ళచీరనే రేణుక ప్రతి ఆదివారం ధరిస్తూవుండేది.

ఆదివున్నమవెళ్ళిన ఆదివారం. రేణుక అరవిందకు ముదముగూర్చే గళ్ళ చీరనుగట్టుకొని, అరవిందాన్ని చంకబెట్టుకొని బెనర్జీ స్టుడియోకిబయులుదేరి వెళ్ళింది, అరవిందయొక్క శిలావిగ్రహానికెదురుగా రేణుక, బిడ్డను ఒడిలో బెట్టుకొనికూర్చుంది. బెనర్జీ ప్రక్కగాకూర్చున్నాడు ఇద్దరూ నిమీలిత నేత్రాలతో చేతులుముకుళించీ, అరవింద ఆత్మశాంతికి భగవంతుని ప్రార్థిస్తూఉండగా ఆచేరువలో ఒకకోయిల జంట శ్రావ్యంగా పాడింది.

అరవిందము కట్టెదుటనిలచి, చిరునవ్వులొలికించే ముద్దుముఖంతో ఆనందమును గ్రుమ్మరిస్తున్నట్లుగా ఆదంపతులిద్దరూ తమహృదయ పరిపంచాలలో చిత్రించుకొని, ఆనందపరవశులైనారు.

స మా ప్త ము.

---